Photo by S. G. Pradhan



బహుమతి
పొందిన వ్యాఖ్య

గూటిలో పయారం

పంపినవారు:
ఎస్. మోహనరావు - బెజవాడ

## ఈ సంచికలో కథలు
## వింతలు - విశేషాలు







ఇవిగాక రంగుల బొమ్మ కథ, ఫోటో శీర్షికల పోటీ, వార్తలు— విశేషాలు, మొదలైన మరి ఎన్నో ఆకర్షణలు

## చందాదారులకు మనవి

★

పైనెల చందమామలు యీనెల చివరి వారంలో పోస్టు అవుతవి. సకాలంలో అందనివారు, వారి పోస్టాఫీసులో ఫిర్యాదు చేస్తూ, పై నెల పదోతేదీలోగా మాకు తెలియపర్చ గోరుతాము. ఆ పైబడువచ్చు కంప్లెయింట్లు, గతనెలలో చేరలేదనే కంప్లెయింట్లు గమనించబడవు.

మేనేజరు



# విజయ ప్రొడక్షన్స్ వారి

# 'లవకుశ'

చిత్రంలో నటించుటకు

చక్కని రూపము, చురుకుదనం, వాక్శుద్ధిగల

## బాలకులు కావలెను

6 మొదలు 12 సం॥లు వయసు స్ఫురించే ఆకారము కలవారు, బాధ్యతగల వారి పెద్దలద్వారా మాకు తెలియ జేస్తూ, వారి ఫోటోలు (యిప్పుడు తీసినవి) జూ॥ 30-వ తేదీలోపల మాకు చేరునట్లు పంపగోరుచున్నాము.

1. ఫోటోలు తిరిగి పంపబడవు.
2. మాకు అవసరమని తోచినవారితో తప్ప, ఉత్తరప్రత్యుత్తరములు జరుపబడవు.

ఫోటోలు యీక్రింది చిరునామాకు పంపవలెను.

**THE VIJAYA PRODUCTIONS LTD.**

(LAVA KUSA CASTING DEPT.)

VADAPALANI : MADRAS-26

# చందమామ

సంచాలకుడు : 'చక్రపాణి'

క్రిందటి సంచికతో ముగిసిన "తోకచుక్క" పాఠకుల మన్ననల నందుకున్నందుకు చాలా సంతోషం. అయితే కొందరు పాఠకులు "తోకచుక్క"కు సంబంధించిన కొన్ని విషయాలు స్పష్టంకాలేదని వ్రాశారు. ఈ సంచికలో ప్రారంభమవుతున్న "మకరదేవత"లో పాఠకుల అనుమానాలన్నీ తీరిపోతాయి. "తోకచుక్క" లోని సంఘటనలు జరిగిన 20 ఏళ్ల తర్వాత "మకరదేవత" ప్రారంభమవుతుంది. అందులోని కొన్ని పాత్రలు ఇందులో మళ్ళీ దర్శనమిస్తాయి. కాని కథ దేనికదే. "తోకచుక్క"లాగే "మకరదేవత"కూడా పాఠకుల ఆదరాభిమానాలు చూరగొంటుందని ఆశిస్తాము.

ఈ మాసంనుంచీ "చందమామ" ఇంగ్లీషులోకూడా ప్రారంభమయిందని తెలపటానికి సంతోషిస్తున్నాము.

జూలై 1955

సంపుటి 17 సంచిక 1



# అట్టమీది బొమ్మ

అరణ్యావాసంలో ఉన్నటువంటి పాండవులవద్దకు మార్కండేయుడు వచ్చి, అనేకమైన గాథలు వినిపిస్తున్నాడుకదా! వాటిలో ఇదొకటి:—

పూర్వం, వైవస్వతమనువు అనే ఒక మహారాజు ఉండేవాడు. ఆయన ఒకప్పుడు గంగానదీతీరాన తపస్సు చేసుకొంటూ వుండగా, ఒక చిన్న చేప కనిపించి, 'ఓ తపోనిధీ!—మా జాతిలో పెద్దచేప చిన్నచేపను మింగడం ఆచారంగా ఉంటున్నది. నన్ను పెద్దచేప ఏదైనా వచ్చి మింగుతుందేమోనని భయమవుతున్నది. కనుక, నన్ను ఈ గంగలోనుంచి తీసుకుపోయి, మరొక సురక్షితమైన జలాశయంలో వదిలి పుణ్యం కట్టుకో. నీకు ఎప్పటికైనా, ఏ విధంగానైనా ఉపకృతి చేసి రుణం తీర్చుకుంటాను' అని వేడుకొన్నది.

దయాళువు అయిన వైవస్వతుడు దానిని తన వెంట పట్టుకపోయి, ఒక జలాశయంలో వుంచి, జాగర్తగా కాపాడుతున్నాడు. కొద్దిరోజులకే ఆ చేప పెద్దదై, 'రాజా!— ఈ స్థలం నాకు చాలటంలేదు. మరొక పెద్ద జలాశయంలో నన్ను విడిచిపెట్టు,' అని కోరింది,

అలానే రాజు, దానిని ఒక పెద్ద సరోవరంలో విడిచి పెట్టాడు. మరికొంత కాలానికి ఆ చేప, ఆ సరోవరంకూడా పట్టనంత పెద్దదిగా తయారయింది. అప్పుడు మనువు దాని కోరికపైన ఆ చేపను గంగానదిలో వదిలాడు.

ఐతే—గంగానది లోతుకూడా దానికి చాలక, ఆ చేప తను సముద్రానికి వెళుతున్నానని చెప్పి, 'రాజా!–కొద్దికాలంలోనె మహాప్రళయం రాబోతున్నది. కనుక నీవు మహనీయులైన సప్తఋషుల్నీ, సృష్టిలోని సమస్త బీజాలనూ ఒక పడవలో ఎక్కించుకొని సముద్రంలో బయల్దేరు. నేను నా శృంగాన్ని ఆ పడవ తాడుకు తగిలించి, పడవను ప్రళయజలంనుండి రక్షిస్తాను' అని తెలిపింది.

కొద్దికాలానికి మహాప్రళయం రానేవచ్చింది. అప్పుడు చేపరూపంలో వున్న శ్రీ మహావిష్ణువు పడవను ప్రళయజలంనుంచి లాక్కుపోయి, మునగకుండా మిగిలివున్న ఒకే ఒక హిమాలయ శిఖరానికి చేర్చాడు. తరువాత ఈ వైవస్వత మనువునుంచే ప్రపంచంలో పునఃసృష్టి ప్రారంభమయింది.




పూర్వం, బ్రహ్మదత్తుడు కాశీరాజ్యాన్ని పాలించే కాలంలో—సామంత రాజయిన 'చిరాయు' వద్ద నాగార్జును డనే పేరుతో బోధిసత్వుడు ముఖ్యమంత్రిగా ఉండేవాడు.

నాగార్జునుడు దయాళువు, దానశీలుడున్నూ. అంతేకాదు. రసాయన శాస్త్రంలోనూ, ఓషధీ జ్ఞానంలోనూ గొప్ప నిధి. అతను, తనకు తెలిసిన రసాయనిక ప్రయోగంతో ఒక రహస్య యోగం కనిపెట్టి, తనకూ, రాజుకూ జరామరణాలు లేకుండా చేసుకున్నాడు.

ఒకనాడు అతని కొడుకులలో కెల్లా తనకు ప్రేమాస్పదుడైన సోమదేవుడు చనిపోవడం తటస్థించింది. కుమారుని చావు నాగార్జునుడికి అంతులేని దుఃఖం కల్గించింది. సహజంగా కరుణాళువైన నాగార్జునుడు—'ఇటుపైన లోకంలో మరణమనేదే ఉండకూడదు. ఇందువల్ల ఎవరూ శోకించకూడదు. ఇందుకు తగిన ఉపాయం కనిపెట్టాలి' అంటూ తీవ్రమైన యోచనలో పడ్డాడు.

'రసాయనాలైతే అమిత వ్యయంతో కూడుకొన్న పని. అందుచేత, సామాన్యులకు కూడా సులభ సాధ్యమై, అందుబాటులో వుండే మూలికలతోనే అమృతం తయారు చేయాలి. దీనితో లోకంలో మరణమనేది లేకుండాచేస్తే ప్రజ సుఖంగా వుంటారు' అని నాగార్జునుడు నిశ్చయించాడు.

ఇలా నిశ్చయించి, అతడు ఓషధుల సంపుటితో అమృతాన్ని తయారు చేయడానికి పూనుకొన్నాడు. తను సంపాదించిన శాస్త్రవిజ్ఞానాన్ని అంతటినీ పరీక్షకు పెట్టి చిరకాలం అనేక పరిశోధనలు చేశాడు. చాలవరకు ప్రక్రియలన్నీ పూర్తిఅయినై. నాగార్జునుడి యత్నం చివరి ఘట్టానికి వచ్చింది. 'అమృత కల్పం' అనే మూలిక ఒక్కటి చేర్చడంతో, పని పూర్తి అవుతుంది.




అంతలో, ఈ సంగతి దేవేంద్రునికి తెలియవచ్చింది. వెంటనే దేవేంద్రుడు అశ్వినీ దేవతల్ని పిలిచి, 'మీరు ఇప్పుడే భూలోకానికి పోయి, ఎలాఐనా, నాగార్జునుడు తలపెట్టిన 'అమృతయోగం' సిద్ధించకుండా చేయాలి. సామదాన భేద దండోపాయాలు ప్రయోగించండి. తక్కినపని నేను చూస్తా'నన్నాడు.

ఇందుకు నియమించబడిన అశ్వినీ దేవతలు మారు రూపాలతో భూలోకానికి దిగివచ్చి, నాగార్జునుణ్ణి దర్శించి, కుశల ప్రశ్నలు ప్రారంభించారు. 'మంత్రిపుంగవా! రాజ్యాల్నే తలకిందులు చేయగల యుక్తులు తెలిసిన ఘనుడవు నీకు తెలియని విషయం లేదు. కాని ఇప్పుడు బ్రహ్మ సంకల్పానికే విరోధం కల్గించటానికి సాహసిస్తున్నావు. మానవుల ధర్మగతి ఐన మరణాన్ని నీవు అమృతసిద్ధిచేత ప్రతిబంధించినట్టయితే, సృష్టిపరిపాలనే తారుమారవుతుందే? మానవుడు ఒక్కడూ చావకుండా వుంటే, ఎన్ని లోకాలైనా సరిపోతవా? పైగా-దేవతలు చేయవలిసిన ఈ కార్యం, మానవ మాత్రుడవైన నీవే సాధించబూనుకుంటే, దేవతలకూ మానవులకూ వ్యత్యాసమేముంది? ఇంతకూ, నీ కొడుకు చనిపోయాడని దుఃఖంకొద్దీకదా, ఇంత పని చేస్తున్నావు? నీ కుమారుడు భూలోకం వదిలినా, స్వర్గంలో సుఖంగానే వున్నాడు' అని ధర్మబోధ చేశారు.

ఈ మాటలు నాగార్జునుడి మనస్సుకి అంతగా తృప్తి కలిగించలేదు. తను చేస్తున్న పని తప్పు అవుతుందా కాదా అన్న ఆలోచనలో మునిగిపోయాడు.

ఇలా వుండగా—

చిరాయు పుత్రుడైన జయసేనుడి యువరాజ్యాభిషేకానికి ఘనమైన యేర్పాట్లు జరిగినై. శుభముహూర్తాన దర్బారంతా కిటకిటలాడుతూ వుంది!

ఈలోపల, వృద్ధబ్రాహ్మణ రూపంలో భూలోకానికి చేరుకున్న దేవేంద్రుడు జయసేనుణ్ణి సమీపించి, రహస్యంగా ఇలా అన్నాడు: 'నాయనా!—నీ తండ్రికి నాగార్జునుడు ప్రయోగించే రసాయనిక సేవనవల్ల అయనకు జరామరణాలే లేవన్న మాట నీకు తెలియదా? అటువంటప్పుడు నీవు యువరాజుగా ఉండిపోవలిసిందేకాని, నీకు రాజ్యార్హత ఎప్పటికీ కలగదు."

ఇది విని, జయసేనుడు విచారంతో కుంగిపోయాడు. అప్పుడు వృద్ధబ్రాహ్మణుడు వానిని ఇలా సముదాయించాడు: 'నాయనా!—ఈపాటిదానికే ఖేదపడకు. నీ కోరిక నెరవేరడానికి సులువైన ఉపాయమున్నది. రోజూ భోజనముందు, ఎవరేమి కోరినా లేదనకుండా ఇవ్వడం నాగార్జునుడికి మామూలు. రేపు నీవు ఆ వేళకు వెళ్లి, ఎంతమాత్రం జంకకుండా, 'నాకు నీ తల కావాలి!' అని అడుగు. తరువాత ఏం జరుగుతుందో నీవే చూదువుగాని,' అని మనస్సుకు నచ్చేటట్టు నూరిపోశాడు.

రాజ్యకాంక్షతో వున్న జయసేనుడు మరునాడు భోజనాలవేళ నాగార్జునుడి వద్దకు వెళ్ళి, సరీగా వృద్ధుడు చెప్పినట్టే కోరాడు. నాగార్జునుడు కొంచెమైనా సంశయించక, తన కత్తి జయసేనుడి చేతికిచ్చి,



'నాయనా!—తల తెగొట్టి తీసుకో. భయపడకు' అన్నాడు. రసాయనప్రభావంవల్ల నాగార్జునుడి శరీరం వజ్రకాయమై వుండె! కనుక, జయసేనుడు ఎన్ని దెబ్బలు కొట్టినా, కత్తి తూలుతూవుందేగాని, నాగార్జునుడి తలమాత్రం తెగలేదు!!

ఈ సమాచారం ఒక్క త్రుటిలో రాజుకు తెలిసి, ఆయన ఆత్రంతో పరుగెత్తివచ్చాడు. కొడుకు చేస్తున్న పనికి చింతించి, వానిని వారింపబోయాడు.

అప్పుడు నాగార్జునుడు 'మహారాజా!—యువరాజు కోరిన కోరికకు పూర్వాపరాలు అన్నీ నాకు తెలుసు. అతను నిమిత్త మాత్రుడు. కనుక, వాని నాటంకపర్చ వద్దని కోరుతున్నాను. ఇప్పటివరకూ గత జన్మలలో నేను తొంభైతొమ్మిదిసార్లు, ఖేదనకుండా నా తల కొట్టి ఇచ్చివున్నాను. ఇది నూరవది. ఈ కొంచెంలో వెనుకంజ వేశాననే అపకీర్తి రాకుండా మాటదక్కించవలసిన భారం నీపై వున్నది' అంటూ కడపటిసారి భక్తితో రాజును ఆలింగనంచేసుకున్నాడు. వెంటనే తనవద్దనున్న మూలికలలోనుండి ఒకటి తీసి, కత్తికి రాసి, జయసేనుడితో 'ఇప్పుడు కొట్టు నాయనా!' అన్నాడు. జయసేనుడు ఈసారి కత్తితో కొట్టగానే, నాగార్జునుడి తల, కాడనుండి ఊడిన కమలంలాగా కిందపడింది!

ఈ దృశ్యం చూడలేక, రాజుకూడా ప్రాణత్యాగంచెయడానికి సిద్ధమయాడు.

అప్పుడు—కిందపడిన నాగార్జునుడి మొండితల ఇలా అన్నది: "రాజా!—విచారించకు. ఎన్ని జన్మలకైనా నీతోనే ఉంటాను...' అంటూ ప్రాణం విడిచింది.

రాజు పూర్తి విరాగి అయాడు. వెంటనే కొడుక్కి పట్టాభిషేకం కట్టి, తను తపస్సు చేసుకోవటానికి అడవులకు వెళ్ళిపోయాడు.

ఈ విధంగా జయసేనుడికి రాజ్యం చిక్కింది. దేవేంద్రుని వ్యూహం నెరవేరింది.






పూర్వం కర్ణాటక దేశంలో శుద్ధమతి అనే గొప్ప పండితుడుండేవాడు. ఆయన నలభై ఏళ్ళు కాశిలో చదువుకుని వచ్చిన మహా విద్వాంసుడు కావటంచేత, యాభైయేళ్ళ వాడైనప్పటికీ ఆయన కెవరో పిల్లనిచ్చారు. ఆయనదగ్గిర చాలామంది శిష్యులు చదువు కుంటూ ఉండేవాళ్లు.

శుద్ధమతి ఎంత విద్వాంసుడైనా వట్టి ఛాందసుడు. ఆయన భార్య ఆయనకన్న చాలా చిన్నదీ, అమాయకురాలూనూ. ఆమె తమ శిష్యులతో సరదాగా మాట్లాడుతూ ఉండేది. ఇది చూసి గురువుగారికి భార్య మీద లేనిపోని అనుమానాలు కలగసాగాయి.

ఒకసారి అనుమానపిశాచిని చేరనిచ్చిన వాడికి మనశ్శాంతి ఉండదు. శుద్ధమతి ఎవరికీ తెలియకుండా ఇల్లు వదిలి ఒకనాటి అర్ధరాత్రి ప్రయాణమైనాడు. తెల్లవారగానే గురువుగారు లేరని గమనించిన నలుగురు విద్యార్థులు ఆయనను వెతుక్కుంటూ బయలుదేరి త్వరలోనే ఆయనను ఒక గ్రామంవద్ద కలుసుకున్నారు.

"ఒరే, నా భార్య ప్రవర్తన మంచిది కాదని నేను వెళ్ళిపోతూంటే, మీరంతా నావెంట ఎందుకు పడ్డారు?" అని గురువు వారి నడిగాడు.

విద్యార్థులు తెల్లబోయి, "గురూ, ఆవిడ మా తల్లిలాటిది. ఆవిడ ప్రవర్తన ఎటువంటిదో మేము కనిపెట్టలేమా? మీకీ పాపిష్టి అనుమానం ఎలా కలిగింది? మేము మటుకు మీదగ్గిరే చదువుకుంటాం. మీ రెక్కడికి పోతే అక్కడికి వస్తాం," అన్నారు.

తాను పొరపడ్డట్టు శుద్ధమతి తెలుసుకుని, ఇంటికి శిష్యులతో తిరుగుప్రయాణ మైనాడు. దారిలో ఒక నగరం వచ్చింది. అప్పటికి జాము పొద్దెక్కింది. వారందరూ నడకశ్రమవల్ల ఆయాసపడుతూ వీధిలోనే

ఆర్. శివరావు




ఒకచోట చతికిలబడి పైబట్టలతో విసురుకో సాగారు. ఆ వీధి పొడుగునా ఇళ్ళ అరుగు లున్నాయికాని వారికి వాటిమీద విశ్రమించ వచ్చునని తోచలేదు.

కొద్దిసేపట్లో ఒక స్త్రీ చంకన బిందె పెట్టుకుని అటుగా బావికి పోతూ వీరిని చూసి, "అయ్యా, మీరెవరు?" అని అడిగింది.

"అమ్మా, మేము పరదేశులం?" అన్నారు వాళ్ళు.

"మీరు పరదేశులు కాకేం?" అంటూ ఆమె బావికి వెళ్ళిపోయింది.

వారు ఒకరి మొహం ఒకరు చూసుకుని, ఆమె బిందెతో ఇంటికి పొయ్యేటప్పుడు, "అమ్మా, మేం పరదేశులం కాకపోతే మార్గస్థులం," అన్నారు.

"మీరు మార్గస్థులూ కారు," అంటూ ఆమె వెళ్లిపోయింది.

ఆమె మళ్ళీ బిందె ఎత్తుకుని బావికి వెళ్లేటప్పుడు, వాళ్లు, "అట్లాఐతే మేం బాటసారులమని ఒప్పుకుంటావా?" అన్నారు.

"ఒప్పుకోను," అంటూ ఆమె బావికి వెళ్ళింది. ఆమె తిరిగివచ్చేలోగా గురుశిష్యులు తమలో తాము విత్కరించుకున్నారు. ఈవిడ చాలా విద్వాంసురాలై ఉండవచ్చు. ఈవిడ నడిగి తామెవరో తెలుసుకుంటేగాని తమ చదువు ఫలించదు. అందుకని ఆమె మళ్ళీ ఇంటికి వెళ్ళేటప్పుడు, "అమ్మా, మేము పరమ మూఢులం—" అని యేదో చెప్పబోయారు.

ఆమె నవ్వి, వారి మాటకు అడ్డొస్తూ, "మీరు మూఢులుకూడా కారు," అన్నది.

"అయితే, దయచేసి, మేమెవరమో చెప్పి మరీ వెళ్ళు," అన్నారు వాళ్లు.

"బాగా పొద్దెక్కింది. ముందు మా ఇంటికి వచ్చి, వంట చేసుకుని భోంచెయ్యండి. తరవాత మీరెవరో చెబుతాను," అన్నదామె.

ఈ మాట వినగానే వారందరికీ పరమానంద మయింది. వారామెవెంట ఆమె

యింటికి వెళ్ళారు. ఆమె వారికి వంట ఇల్లు చూపించి, "అయ్యా, నాభర్త రాజు గారింట పురాణపఠనం చేసి సరిగా రెండు జాముల వేళకు ఇల్లు చేరుతారు. ఆయన అసలే అనుమానం మనిషి. అందుచేత ఆయన వచ్చేలోగా మీరు స్నానం, జపం, వంటా, ముగించుకోండి. లేకపోతే చాలా చిక్కువస్తుంది," అని హెచ్చరించింది.

ఆ చాదస్తపు బ్రాహ్మణులు సరేనన్నారే గాని, వాళ్ల స్నానాలూ, జపాలూ, గీతా పారాయణలూ మొదలైన కర్మకాండ ఎంతకీ పూర్తికాలేదు. ఈలోగా ఇంటి యజమాని రానేవచ్చాడు.

ఆయన భార్య చెప్పినట్టు ఆయన తగని అనుమానం మనిషి. తన భార్య చాలా దుర్మార్గురాలనీ, ఎట్లాగైనా ఆవిడ దుర్మార్గాన్ని రుజువు చెయ్యాలనీ ఎంతకాలంగానో చూస్తున్న ఆ బ్రాహ్మణుడు వంట ఇంటో ఈ ఛాందసులను చూసి వెంటనే ఆ గదికి తాళంపెట్టి, తన భార్య ఏ గదిలో ఉన్నదీ చూసి, ఆ గదికికూడా తాళంపెట్టి నేరుగా రాజుగారిదగ్గిరికి వెళ్ళాడు.

పురాణం చదివే బ్రాహ్మడు అంతలోనే తిరిగి రావటం చూసి రాజు ఆశ్చర్యపడ్డాడు.

"మహారాజా, నాభార్య దుష్టురాలు, దండించమని నేను తమర్ని ఎన్నోసార్లు






కోరాను. కాని తమరు రుజువు కావా లన్నారు. వంట ఇంటో అయిదుగుర్ని దాచింది. కళ్ళారా చూద్దురుగాని. దయ చెయ్యండి," అన్నాడు బ్రాహ్మడు.

రాజు కంగారుపడుతూ ఆయన వెంట వచ్చాడు. బ్రాహ్మడు వంటఇల్లు తలుపు తాళం తీసేసరికి ఐదుగురు బ్రాహ్మలు, విభూతి పెండెకట్లు ధరించి కనబడ్డారు. వారిని చూసి ఆశ్చర్యపోతూ:

"అయ్యా, మీరెవరు?" అన్నాడు రాజు.

"అది తెలుసుకోవటానికే కద, మేమీ ఇంటావిడ వెంట వచ్చి ఇక్కడ వంట చేసుకుంటున్నాం?" అన్నారు వాళ్ళు.



వాళ్లు చెప్పినదంతా విన్నాక రాజుకు ఆ యింటావిడ నిర్దోషి అని తెలిసిపోయింది. కాని, ఆవిడ ఈ బ్రాహ్మలను చూసి, వారు పరదేశులుగాని, మార్గస్థులుగాని, బాటసారులుగాని, మూఢులుగాని కారని ఎందు కన్నదో రాజుకు అర్థంకాలేదు.

ఆయన ఇంటావిడ ఉన్న గది తాళం కూడా తీయించాడు.

"అమ్మా, నీవల్ల తప్పేమీ లేదని నాకు తెలిసింది. కాని ఈ బ్రాహ్మలు నీ దృష్టిలో ఎవరో చెప్పు. వారు పరదేశులమంటే కాదని ఎందుకన్నావు?" అని రాజు అడిగాడు.

"అయ్యా, వారు నీడలో అరుగులుండగా వాటిమీద కూచోక ఎండలో, వీధిలో దర్భాసనాలు పరిచి కూచునిఉండటం చూశాను. వారి ఛాందసం చూసి జాలికలిగి, వారిని ఇంటికి పిలిచి స్నాన భోజన సౌకర్యాలు చూపుదామని పలకరించాను. మీరెవరంటే పరదేశులమన్నారు. మనం మాట్లాడే భాషే మాట్లాడేవారు మనకు పరదేశులెల్లా అవుతారు? అందుకని కారన్నాను," అన్నది ఇంటావిడ.

"మరి మార్గస్థులు కారని ఎందు కన్నావూ?" అని అడిగాడు రాజు.



"అయ్యా, మార్గస్థులు విశ్రాంతి తీసుకునే చోట విశ్రాంతి తీసుకుంటారు. బాటసారులు బాటను నడవటానికి ఉపయోగిస్తారు. కాని వీరలా చేయక బాటను సత్రంలాగా వినియోగించుకున్నారు. అది చూసి నేను, వారు మార్గస్థులు కారనీ, బాటసారులుకూడా కారనీ అన్న మాట నిజమే!' అన్నది ఇల్లాలు.

"నిజమే. కాని, వారు తాము మూఢుల మని ఒప్పుకున్నా, కాదని ఎందు కన్నావు?" అన్నాడు రాజు.

ఈ ప్రశ్నకు ఆ యిల్లాలు వెంటనే సమాధానం ఇవ్వకపోవటం చూసి రాజు, "చెప్పమ్మా! నేనుండగా నీకు భయ మెందుకూ?" అన్నాడు.

"పట్టపగలు మిట్టమధ్యాన్నం అయిదుగురిని తన భార్య ఇంట చేర్చిందని నమ్మే భర్తనూ, అటువంటివాడు చేసిన ఫిర్యాదును నమ్మి కళ్ళారా చూడవచ్చిన న్యాయపాలకుణ్ణీ మూఢులనటం చెల్లుతుందిగాని, ఛాందసులైనంత మాత్రాన చదువుకున్న విద్వాంసులు మూఢులౌతారా మహారాజా?" అని అడిగిందా యిల్లాలు.

ఆమె భర్తా, రాజూకూడా ఏమీ అనలేక తలలు వంచుకున్నారు.

"అనుమాన పిశాచిని చేరనిచ్చిన నాకు తమరు సరిఅయిన శిక్ష విధించాలి!" అన్నాడు పురాణాల బ్రాహ్మడు.

ఈ మాట వినగానే శుద్ధమతి ముందుకు వచ్చి, "మహారాజా, నేనుకూడా అనుమాన పిశాచిని ఆదరించినవాణ్ణే. ఈ బ్రాహ్మడికి ఏ శిక్ష విధిస్తారో అదే శిక్ష నాకు కూడా దయచేయించండి," అంటూ తన కథ అంతా చెప్పాడు.

రాజు వారిద్దరినీ ఓదార్చి, "ఇకముందైనా మీ భార్యలను గౌరవంగా చూసుకోండి," అని సలహాచెప్పాడు. శుద్ధమతి శిష్యులతో ఇంటికి తిరిగి వెళ్లాడు.





# బ్రాహ్మణ దొంగ

భోజరాజు నిత్యమూ చేసే దానధర్మాల కింద ధనం హెచ్చుగా ఖర్చయి పోతూండేది. ఈ ఖర్చు ఎలాగైనా తగ్గేటట్టు చేయాలని మంత్రికి తోచింది. 'మహాప్రభూ! తమరు కవి పండితులకింద చాలా ద్రవ్యం ఖర్చు చేసేస్తున్నారు. ఇందువల్ల ధనాగారంలో తగినంత సొమ్ము నిలవ ఉండటం లేదు,' అంటే రాజుకు ఆగ్రహం వస్తుంది. అందుచేత ఒకనాడు మంత్రి భోజరాజు లేని సమయంలో ఆయన పడకగదిలో గోడమీద, ఈవిధంగా రాశాడు.

"ఆపదర్థం ధనం రక్షేత్"

(ఆపత్సమయంలో అవసరానికిగాను ధనం కూడబెట్టాలి)

ఆ రాత్రి భోజుడు గోడమీద వున్న శ్లోక పాదం చదువుకుని, తాను చేసే ఖర్చును విమర్శిస్తూ ఎవరో ఆ మాటలు రాశారని అర్థంచేసుకున్నాడు. ఆ చరణం కింద, భోజరాజు ఇలా ఎదురుప్రశ్న రాశాడు.

"శ్రీమతా మాపదః కుతః?"

(శ్రీమంతులకు ఆపద ఎక్కడ?)

మర్నాడు మంత్రి భోజుడు రాసినది చదువుకుని, దానికింద,

"సా చే దపగతా లక్ష్మీ"

(ఆ సంపద పోతేనో) అని రాశాడు.

ఇది చదువుకుని భోజరాజు దానికింద,

"సంచితార్థో వినశ్యతి"

(కూడబెట్టినదికూడా పోతుంది.) అని రాశాడు.

ఆరాత్రే ఒక పేద బ్రాహ్మడు దొంగతనానికని భోజరాజు పడకగదిలో ప్రవేశించి ఒక మూల దాక్కున్నాడు. ఆ బ్రాహ్మడు చదువుకున్నవాడు. అయితే దారిద్ర్యం భరించలేక దొంగతనానికి పూనుకున్నాడు. రాజుగారి పడకగదిలో చాలా రత్నాభరణాలు కనిపించాయి. తీరా తీసుకో

వి. సత్యనారాయణ

బోయేసరికి ఆయన అంతరాత్మ ఒప్పలేదు. వట్టిచేతులతో వెళ్ళిపోవటమూ, వచ్చిన పని పూర్తిచేసుకోవటమూ అని చాలాసేపు తటపటాయించి, దొంగతనం చేయగూడదని నిశ్చయించుకుని, ఆయన బయటికి పోబోతూండగా భోజరాజూ, ఆయన భార్య లీలావతీ గదిలోకి వచ్చారు. బ్రాహ్మడు దాక్కున్నచోటే ఉండిపోయాడు.

లీలావతి గోడమీది శ్లోకం చూసి, అదేమిటని భర్తనడిగింది. భోజరాజామెకు ఎవరో రాసిన పంక్తులూ, దానికి తాను రాసిన సమాధానాలు చూపి, ఆమెతో అన్నాడు:

"చేతోహరా యువతయః

సుహృదోనుకూలాః,

సద్బాంధవాః ప్రణయగర్భ

గిరశ్చ భృత్యాః,

వల్గంతి దంతినివహా,

స్తరళా స్తురంగాః—"

[(నాకు) అందమైన భార్యలున్నారు, అనుకూలురైన స్నేహితులున్నారు, మంచి చుట్టాలున్నారు, ఇష్టంగా మాట్లాడే సేవకులున్నారు, అనేక ఏనుగులున్నాయి, గుర్రాలున్నాయి—]

భోజరాజు చెప్పేది పూర్తికాకముందే, దాక్కునిఉన్న బ్రాహ్మణ దొంగకు తిక్క రేగిపోయింది.

"సమ్మీలనే నయనయో ర్నహి కించి దస్తి"

(ఆ రెండు కళ్ళూ మూసేసరికి, ఏదీ ఉండదు.) అని ఆయన, భోజరాజు పూర్తి చెయ్యకుండా మిగిల్చిన శ్లోకం పూర్తి చేశాడు.

భోజరాజు నివ్వెరపోయి, "ఎవరది?" అని కేక పెట్టాడు. బ్రాహ్మణ దొంగ ముందుకు వచ్చి, రాజుకు నమస్కరించి తన గొడవ చెప్పుకుని క్షమాపణ కోరాడు.

భోజరాజు సంతోషించి, తన చేతిమీదుగానే ఆ బ్రాహ్మడికి కొన్ని నగలూ, దుస్తులూ ఇచ్చి పంపేశాడు.





# వింత కౌటుకాలు

ఒక ఊళ్ళో ఒక గృహస్థుకు ముగ్గురు కుమార్తెలు. తండ్రి ఆ ముగ్గురికీ మంచి సంబంధాలు తెచ్చి పెళ్ళిళ్ళు చేసేశాడు.

ఆఖరుపిల్లను దాని అత్తగారు ఒక్క పని చెయ్యనిచ్చేదికాదు. పైపెచ్చు అది ఎక్కడ కందిపోతుందో అని దానికి అడ్డమైన ఉపచారాలూ తానే చేసేది.

ఇంతలో సంవత్సరాది వచ్చింది. అత్త తన కోడలికి చక్కగా తలంటి నీళ్ళుపోసి, కొత్త పట్టుచీరె కట్టబెట్టి, ఇంటోవున్న నగలన్నీ పెట్టింది. మధ్యాన్నం కొడుక్కూ, కోడలికీ పిండివంటలతోసహా స్వయంగా వంట చేసిపెట్టింది. సాయంకాలందాకా, ముసలావిడ ఇంటిపనులన్నీ చేసి, బయటికి పోతూ, "అమ్మాయ్, గుడికి వెళ్ళొస్తాను. కనుచీకటి పడగానే దీపంపెట్టు!" అని చెప్పి వెళ్లిపోయింది. ఈ మాట విని కోడలు మండిపడింది.

"ఊరికే కూచునిపోతానని ఏదో ఒక పని చెబుతుంది! వెళ్ళేమనిషి ఆదీపం తానే పెట్టిపోగూడదూ? ఈ భాగ్యానికి కనుచీకటి పడాలా? ఎవరు పడతారీ కొరంటకం? నేను పుట్టింటికి వెళ్ళిపోతాను. ఈ ఇంటో క్షణం ఉండను," అనుకుని, ఆపిల్ల అప్పటి కప్పుడు తన చీరెలు నాలుగూ మూటకట్టుకుని బయలుదేరింది.

దారిలోనే దాని చిన్నక్క అత్తవారి ఊరు. తన కష్టాలు అక్క చెవినివేసి మరీ పోదాంగదా అని ఆపిల్ల వాళ్ళింటికి వెళ్ళింది చిన్నక్కతో జరిగినదంతా చెప్పుకుని కంట నీరు పెట్టుకుంది.

చిన్నక్క చెల్లెల్ని ఓదారుస్తూ, "ఊరుకోవే, అమ్మా! నిన్ను అత్తముండ కష్టాలు పెడుతోంది. అది ఇవాళ ఉంటుంది, రేపు పోతుంది. నా కష్టాలకు దరీదాపూ లేదే! నేనెవరితో చెప్పుకోను?" అన్నది.

కే. అనసూయ

"ఏమిటి, చిన్నక్కా, నిన్ను కష్టాలు పెట్టేదెవరు?" అని చెల్లెలు ఆత్రంగా అడిగింది.

"ఇంకెవరున్నారు? నామొగుడే? పండగకి చేయించానని కట్టెడు బరువు కాసుల దండతెచ్చి మెడలో వేశాడు. మొయ్యలేక చచ్చాను. మెడంతా పీక్కుపోయింది. అపేక్షగల మొగుడైతే అంత దుర్మార్గం చేస్తాడా? నేనీ కాపరం ఈదలేను, తల్లీ! పద, ఇద్దరంకలిసి అమ్మతో చెప్పుకుందాం!"

ఒకరికి ఇద్దరై బయలుదేరారు. దారిలోనే వాళ్ళ పెద్దఅక్క అత్తవారి ఊరు. "పనిలో పని, పెద్దక్క ఏమి ఇక్కట్లు పడుతున్నదో తెలుసుకుని మరీ పోదాం," అనుకున్నారు వాళ్ళు.

తన చెల్లెళ్ళను చూడగానే పెద్దఅక్కకు ఎక్కడలేని ఆనందమూ కలిగింది. వాళ్ల బాధలన్నీ విని పెద్దది తన కళ్ళు తుడుచుకుంటూ, "ఇంకా నీ మొగుడే నయం. నామొగుడిసంగతి వింటే మీరు నిర్ఘాంతపోతారు," అన్నది.

"ఏమక్కా? నీ మొగుడేంచేశాడు?" అన్నారు చిన్నవాళ్ళిద్దరూ.

"ఏమని చెప్పేది? నిన్న రాత్రి భోంచేశాక కాస్సేపు నేనూ మా అయనా



పారిజాతం చెట్టుకింద కూచున్నాం. చెట్టుమీదినుంచి టపా, టపా నాలుగు పువ్వులు రాలి నా మొహాన పడ్డాయి. అయ్యో, దెబ్బతగిలిందా అని నన్ను అదరించటం అటుంచి ఆ కర్కోటకుడు నన్ను చూసి నవ్వాడు. ఇంత కసాయివాడితో ఎంత కాలం కాపరంచేస్తాను, ఏమిటి దారి అనుకుంటుండగా మీరూ వచ్చారు. పదండి, నేనుకూడా మీతో వస్తున్నా!" అన్నది పెద్దది.

ముగ్గురు అక్కచెల్లెళ్ళూ కలిసి పుట్టిల్లు చేరుకున్నారు. తల్లి వంటింటో వంట చేస్తున్నది. ముగ్గురు కూతుళ్ళూ తల్లిని కావిలించుకుని బావురుమని ఏడిచారు.

"అయ్యో నాకూనల్లారా ? మీకేం కష్టం వచ్చింది? అన్నీ భరించటానికి నేనున్నాను గద. నాతో చెప్పండి!" అన్నది తల్లి.

ముగ్గురూ తమ కష్టాలను చెప్పుకున్నారు.

అంతావిని తల్లి, "నేనంటూ బతికి ఉన్నానుగనక మీరు నాదగ్గిరికి వచ్చారు. నన్ను మీ నాన్న పెట్టే కష్టాలెవరితో చెప్పుకునేది ?" అన్నది.

"చెప్పమ్మా ! మేమున్నాంగా ? మాతో చెప్పు ! " అన్నారు ముగ్గురూ ఆత్రంగా.

"నిన్న పండగకాదూ ? పిండిపంట ఏమన్నా చెయ్యమన్నాడు మీనాన్న. గిద్దెడే గిద్దెడు బియ్యమూ, పప్పూ నానేసి రుబ్బి మూడు రొట్టెలు చేశా. ఉప్పు సరిపోయిందో లేదోనని ఒకటి తినిచూశా. సరిగా కాలిందో లేదో అని ఇంకొకటి తిన్నా. ఏవేళకూ మీ నాన్న భోజనానికి రాకపోయేసరికి పరధ్యానంగా మూడోదికూడా తినేశా. ఆయన వచ్చి రొట్టెలు చేశావా అని అడిగితే, మూడు రొట్టెలు చెయ్యటమూ అయింది, తినటమూ అయింది, అని చెప్పా. ఆయన కాస్తయినా విచారించకుండా, పోనీలే, అన్నాడు. ఇంకో మొగుడైతే, 'అయ్యో, మూడు మినప రొట్టెలు తిన్నావుటే? అజీర్ణంచేసి, కడుపు నొప్పి వస్తుందేమో !' అని ఆదుర్దాపడడూ? ఎంత కర్కోటకుడు!" అన్నది తల్లి.

తల్లి కష్టాలు కూతుళ్ళూ, కూతుళ్ళ కష్టాలు తల్లీ తలుచుకుని భోరున ఏడుపులు ప్రారంభించారు. వారి కళ్ళవెంట నీరు గంగాళాలకొద్దీ ప్రవహించసాగింది. కొద్ది సేపట్లోనే వారి శరీరాల్లో ఒక్క చుక్క కూడా నీరు లేకుండా పోయింది. అవి ముడుచుకుపోయి చిన్నవై, ఇంకా చిన్నవై, చివరకు పెసరబద్దలంత అయాయి. వాళ్ళు నలుగురూ నాలుగు నల్లులై పోయారు.

వాళ్ళు బతికి ఉన్నన్నాళ్లూ మనుషుల రక్తం పీల్చుకుతాగారు. వారి సంతతి ఇప్పటికీ అదేవిధంగా బతుకుతున్నది.





# మకర దేవత

పురాళద్వీపానికి రాజైన మందరదేవుడు, ఒకనాడు ఉద్యానవనంలో విహరిస్తూండగా కోటద్వారంవద్ద పెద్ద కలకలం బయలుదేరింది. ప్రజల కేకలూ, సైనికుల హెచ్చరికలతో కోటప్రాంతమంతా మారుమోగసాగింది. ఇంత కలకలానికి కారణమేమిటా అని మందరదేవుడు ఉద్యానవనంనుంచి కోటద్వారంకేసి బయలుదేరాడు.

కొద్దిసేపటిలో మందరదేవుడు కోటద్వారాన్ని సమీపించేసరికి మంత్రి ప్రజలను శాంతంగా వుండవలసిందని హెచ్చరించటం అతడి కంటబడింది. రాజు రాక గమనించిన కొందరు సైనికులు, ఆ సంగతి మంత్రితో చెప్పారు. వెంటనే మంత్రి వెనుదిరిగి రాజును సమీపించాడు.

"ఏమిటీ కలకలం?" అని ప్రశ్నించాడు మందరదేవుడు. మంత్రి క్షణకాలం కోటద్వారంకేసి చూసి, "ప్రభూ, నిజమో అబద్ధమో యింకా ధృవపడలేదు. నావరకు నేను యిందులో కొంత నిజం వుండవచ్చునని భావిస్తున్నాను. కుండలినీద్వీపం యీ మధ్య అరాజక స్థితిలో వున్నదని మన అందరికీ తెలిసినదే. పోతే యిప్పుడువచ్చిన వార్త ఏమిటంటే — ఆ ద్వీప రాజ్యాధికారాన్ని నరవాహనమిశ్రుడనే సేనాని హస్తగతం చేసుకుని మన రాజ్యంమీదికి దాడి బయలుదేరాడని. ఇది చేపలు పట్టబోయిన జాలరులు తెచ్చిన వార్త. ప్రజలు కలవరపడుతున్నారు. శాంతంగా వుండవలసిందని హెచ్చరిక చేశాను," అన్నాడు.




మందరదేవుడు తల పంకించి వూరుకున్నాడు. మంత్రి భావించినట్టు ఇందులో కొంత సత్యం వుండవచ్చునని అతడికీ తోచింది. రాజు మౌనం వహించటంతో, ఆయనా ప్రమాదాన్ని శంకిస్తున్నాడని గ్రహించిన మంత్రి, "ప్రభూ, ముందు జాగ్రత్తకోసం తగు ఏర్పాటులు చేయవలసిందిగా సేనానికి కబురు పంపాను. ఈ వార్తలోని నిజానిజాలు సూర్యాస్తమయం లోపల మన వేగులద్వారా తెలుసుకోవచ్చు. వారు వచ్చేవేళ అయింది," అన్నాడు.

మందరదేవుడు మంత్రికేసి ప్రశ్నార్థకంగాచూసి, క్షణం ఆగి, "సరే, ఆ వార్తలోని నిజానిజాలు తెలియగానే, నాకు తెలియపరుచు. నీకోసం చూస్తూంటాను," అంటూ భవనంవేపుకు సాగిపోయాడు.

రాజు వెళ్ళగానే మంత్రి సరాసరి పోయి కోటబురుజు ఎక్కాడు. అక్కడ నిలబడి చూస్తే, దూరంగావున్న సముద్రం, అందులో తేలియాడుతున్న నావలూ కనబడతై. మంత్రి ఆశించిన విధంగానే దూరాన తెరచాప ఎత్తిన ఒకనావ కనిపించింది. అది సూటిగా మరాళద్వీపానికేసి వస్తున్న సూచనగా క్షణక్షణానికీ మరింత స్పష్టంగా కనిపించసాగింది.

ఇక సేనాని మంత్రినుంచి వార్త రాగానే ముందుజాగ్రతకోసం సైనికులను సమీకరించాడు. చుట్టూ సముద్రంచేత ఆవరింపబడివున్న మరాళద్వీపానికి అప్పుడప్పుడు చేరువలో వున్న ద్వీపరాజ్యాలనుంచి ప్రమాదం సంభవిస్తూండేది. ఆ కారణం వల్ల మరాళద్వీపంలోని ప్రతి పురుషుడూ అంతోయింతో సైనికశిక్షణ పొందడం రాజశాసనంగా వుండేది.

సేనాని కొందరు సైనికులతో సముద్రతీరానికి బయలుదేరాడు. మరాళద్వీప నావికాదళంకూడా అవసరమైతే శత్రునావలతో యుద్ధానికి తలపడేందుకు సిద్ధ

మౌతోంది. శంఖనాదాలద్వారా, చాటింపుల ద్వారా ప్రతి నావికుడూ, సముద్రతీరాన వున్న తమతమ నావలకు రావలసిందిగా ఆజ్ఞాపించబడ్డాడు.

కోట బురుజుపై వుండి ఈ సన్నాహాలను చూస్తున్న మంత్రి, సేనానుల జాగ్రతకూ, విధి నిర్వహణలో వారు చూపుతున్న శ్రద్ధకూ చాలా ఆనందపడ్డాడు. కాని మంత్రి పొందిన ఆనందం, అంతలోనే ఆదుర్దాగా పరిణమించింది. వేగులు వస్తున్న నావకు వెనకగా కొంతదూరంలో హఠాత్తుగా నల్లని మేఘాలు కమ్మినట్టయింది. ఇది తుఫాను సూచనేమో అని మంత్రి అటు పరికించి చూసేటంతలో—అవి మేఘాలు కావనీ, కొన్ని యుద్ధనావలు గుంపుగా మరాళ ద్వీపంకేసి రావటమనీ అతడు గ్రహించాడు. ఆ మరుక్షణంలోనే ఆ యుద్ధనావలనుండి నల్లని పొగలు బయలుదేరినై. కొద్దిసేపటి కల్లా నూనె గుడ్డలు చుట్టి నిప్పంటించటం వల్ల మండుతూన్న కొన్ని బాణాలు వేగులు వస్తూన్న నావమీదికి రాసాగినై.

జాలరులు తెచ్చిన వార్తలు నిజమని అప్పటికి మంత్రి అర్థంచేసుకున్నాడు. ముందు ఏ హెచ్చరికా యివ్వకుండా, యుద్ధప్రకటనకూడా చేయకుండా, పరదేశాలమీద దాడిచేసే కొత్త సంప్రదాయాన్ని





కుండలినీ రాజరికాన్ని హస్తగతం చేసుకున్న నరవాహనమిశ్రుడు ప్రారంభించాడని మంత్రి పళ్లు కొరికాడు. ఒకటి రెండు వందల సంవత్సరాలక్రిందట శాక్తేయుడనే మాంత్రికుడు ఈవిధంగా, యుద్ధ ప్రకటన చేయకుండానే చాలా ద్వీపరాజ్యాలను దోచుకున్నాడు. అతడు రాజవంశీయుడు కాడనీ, మాంత్రికుడు గనక అలా అధర్మంగా ప్రవర్తించాడనీ అప్పట్లో చాలామంది సరిపెట్టుకున్నారు.

మంత్రి ఇలాంటి ఆలోచనలతో వుండగా, మరాళద్వీప నావికా సైన్యం, తమ నావకు రానున్న ప్రమాదాన్ని గ్రహించి ముందుకు



వురికింది. సైనికులు సింహనాదాలు చేస్తూ నావలను ముందుకు నడిపించారు. కొద్ది సేపట్లో సముద్రతీరానికి నాలుగైదు మైళ్ళ లోపల కుండలినీ - మరాళద్వీప నావికా దళాలు యుద్ధానికి తలబడినై.

ఇంతలో సైనికులు కోట బురుజుపైకి రాసాగారు. ఒకవేళ మరాళద్వీప నావికా దళం ఓడింపబడితే, పట్టణాన్ని, రక్షించేందుకు ముందు జాగ్రతగా సైనికులు అక్కడికి పంపబడ్డారు. మంత్రి ఆ సైనికులలో ఒకరిని పిలిచి యుద్ధవార్తలను రాజుకు చెప్పేందుకు పంపాడు.

ఈలోపల సముద్రంలో నావికా యుద్ధం ముమ్మరంగా సాగుతోంది. ఇరుపక్షాల నావికులు ప్రాణాలకు తెగించి పోరాడసాగారు. నూనెలో ముంచిన గుడ్డలను బాణాలకు చుట్టి నిప్పంటించి ఒకరినావల మీదికి ఒకరు విసురుకోసాగారు. నిప్పంటుకున్న నావలనుంచి సైనికులు సముద్రంలోకి దూకుతూంటే, మండుతున్న నావలలోని మంటలను ఆర్పి, వాటిని వశపరుచుకునేటందుకు ఎదిరిపక్షపు సైనికులు వాటిని ఎక్కుతున్నారు.

కోట బురుజుమీంచి ఇదంతా చూస్తున్న మంత్రికి ఇప్పుడు జరుగుతున్న నావికా







"ఏమి జరిగింది? ఎందుకలా పరుగెత్తు కుంటూ వచ్చావు?" అంటూ మంత్రి సైనికుణ్ణి అదుర్దాగా ప్రశ్నించాడు.

"రాజుగారు ఎక్కడ వున్నదీ తెలియటం లేదు!" అంటూ సైనికుడు తడబడుతూ జవాబిచ్చాడు.

"ఆ సంగతి నీకెలా తెలుసు?" అని అడిగాడు మంత్రి.

"అయ్యా, నే వెళ్ళేసరికే రాజభవనం అంతా గందరగోళంగా వుంది. కొద్ది నిమిషాలకిందట రాజుగారు వారి గదిలోనుంచి సహాయానికై కేకలు వేయటం ఒకళ్ళిద్దరు దాసీలు విన్నామని చెపుతున్నారు. భటులు ఆయనకోసం భవనమంతా వెతికారు. ఆయన జాడ లేదు. అంగరక్షకులు ఇద్దరు కూడా కనుపించటంలేదు," అన్నాడు.

అంగరక్షకులు కనిపించటంలేదనేసరికి, మంత్రికి ఏదో ద్రోహం జరిగిందన్న అనుమానం కలిగింది. బహుశా యిది కుండలినీద్వీప రాజ్యాన్ని చేజిక్కించుకున్న నరవాహనమిశ్రుడి కొత్త రాజనీతి ప్రభావం కావచ్చనుకున్నాడు. రాజు భవనంలో లేడనేది ఆయనకోసం వెతికిన భటులు చెపుతున్నారు కనక—ఆయనను బంధించినవారెవరైనా యీసరికి రాజును కోటగోడ

యుద్ధ పర్యవసానం తన రాజ్యానికి అనుకూలంగా పరిణమిస్తుందన్న నమ్మకం సన్నగిల్లసాగింది. ఆతడికి వున్న ఒక ఆశ తాను పంపిన వేగులతో వున్న నావ సురక్షితంగా తీరం చేరాలని. అప్పుడుగాని తనకు కుండలినీ రాజ్యంలో జరిగిన మార్పులూ, నరవాహనమిశ్రుడి సంగతీ, ప్రజల మనస్థితీ అర్థంకాదు

ఇంతలో వెనక అడుగుల చప్పుడు వినబడింది. మంత్రి తలతిప్పి చూసేసరికి, రాజుకు యుద్ధవార్త తెలియపర్చేందుకు పంపబడిన సైనికుడు రొప్పుతూ, రోస్తూ అక్కడికి వచ్చాడు.







అవలికి తీసుకుపోయివుండవచ్చన్న అను మానంకూడా మంత్రికి కలిగింది.

ఇలాంటి అనుమానం కలగటమే తడ వుగా మంత్రి కొందరు సైనికులను తీసు కుని, కోటపైని ఒక బురుజునుండి మరొక బురుజుకు పరుగెత్తుతూ, వెలపల వున్న అగడ్తకేసి చూడసాగాడు. ఒకచోట కోట గోడకు వేలాడుతున్న తాడూ, దానిని పట్టు కుని కిందకు దిగుతున్న ముగ్గురు మను షులూ ఆయన కంటపడ్డారు. వెంటనే మంత్రితో వున్న సైనికులు, "అదుగో, మహారాజూ, ఆయన అంగరక్షకులూ!" అంటూ కేకలువేశారు.

ఇప్పుడేం చేయాలి? మంత్రికి పెద్ద గడ్డుసమస్య ఎదురైంది. కోటగోడను వున్న మేకునుంచి వేలాడుతున్న తాడును ఛేదించ వచ్చు. కాని అలా చేస్తే రాజూ, అతనిని నిర్బంధించి తీసుకుపోతున్న ద్రోహులైన అంగరక్షకులూ అగడ్తలో పడిపోతారు. అలాకాక చూస్తూ వూరుకుంటే వాళ్ళు రాజును బంధించి నిరాటంకంగా తమ రాజ్యానికి తీసుకు పోగలరు.

మంత్రి యిలాంటి సంశయాలతో కొట్టు మిట్టాడుతుండగా ఒక సైనికుడు, "అయ్యా, అటు చూడండి. అగడ్తఒడ్డునే మూడు గుర్రాలు సిద్ధంగా వున్నవి," అంటూ ఆశ్చర్యంతో అరిచాడు. మంత్రి ఆ వైపుకు చూచేసరికి జీనులతో సర్వసిద్ధంగా వున్న మూడు గుర్రాలు కనిపించినై. సమయం చూచి రాజును బంధించి తెచ్చేందుకు నరవాహనమిశ్రుడు రాజభవనంలో తన బంట్లను ప్రవేశపెట్టగలిగాడని మంత్రికి అర్థమైంది. మంత్రి సముద్రంకేసి చూచాడు. వేగులు వున్న నావ తీరాన్ని సమీపిస్తోంది. కుండలినీద్వీప యుద్ధనావలు కూడా రెండు తీరంవైపుకు వస్తున్నవి.

పరిస్థితి విషమంగా వున్నదని గ్రహించిన మంత్రి, సైనికులకేసి తిరిగి, "మీలో నలుగు





రైదుగురు గుర్రాలెక్కి రాజుగారి రక్షణకు వెళ్ళండి. ఈ దుర్ఘటననుగురించి మాత్రం మీరు బయటవున్న ప్రజలతో అనకండి. వెంటనే పొండి," అని ఆజ్ఞాపించాడు.

సైనికులు అక్కడినించి పరుగెత్తారు. మంత్రి కిందకు చూశాడు. అప్పటికి రాజును ద్రోహులైన అంగరక్షకులిద్దరూ అగడ్త దాటించి గుర్రాలు వున్నచోటుకు నడుపుతున్నారు. రాజు ముందు నడుస్తూండగా, వాళ్ళిద్దరూ కత్తులు చేతబట్టి అయన వెనక నడుస్తున్నారు. కొద్దిసేపట్లో వాళ్ళు గుర్రాలెక్కి రాజు ఎక్కిన గుర్రానికి వెనకగా తమ గుర్రాలను పరిగెత్తించసాగారు. వాళ్ళు రాజును సముద్రతీరంకేసి తీసుకుపోతున్నట్టు మంత్రి గ్రహించాడు.

ఇక రాజు రక్షణకై బయలుదేరిన సైనికులు నలుగురూ, గుర్రాలెక్కి బయలుదేరారు. వాళ్ళు కోట తూర్పుద్వారంనుంచి బయటపడి కొద్దిసేపట్లో, రాజును బంధించి తీసుకుపోతున్న ద్రోహులకేసి తమ గుర్రాలను పరిగెత్తించసాగారు. గిట్టల చప్పుడు విని వెనుదిరిగి చూచిన ద్రోహులు యిద్దరూ తమను సైనికులు వెంబడిస్తున్నారని గ్రహించి, రాజువీపుకు తమ కత్తులను గురిచేసి ఆయనను వేగంగా గుర్రాన్ని పరుగెత్తించవలసిందని ఆజ్ఞాపించారు.

కోట బురుజుపైనుంచి యిదంతా గమనిస్తున్న మంత్రి ఒకమారు బంధితుడైన రాజుకేసీ, మరోమారు తీరాన్ని సమీపిస్తున్న శత్రునావలకేసీ చూస్తూ, "మరాళదేవీ, నీ భక్తులను కఠినపరీక్షకు గురిచేస్తున్నావా?" అంటూ హృదయంమీద చేతులు పెట్టుకుని ఆకాశంకేసి తల ఎత్తాడు.

మరుక్షణంలోనే ప్రళయభయంకరమైన ఫెళఫెళారావాలతో ఉరుములూ, మెరుపులూ, ప్రారంభమై, మరాళద్వీపాన్ని దద్దరిల్లచేసినై. మంత్రి నివ్వెరపోయాడు.

—(ఇంకా వుంది)





# ముగ్గురు పెళ్లికొడుకులు

మగధకు రాజధాని అయిన అమరావతీ పట్టణాన్ని ఒకప్పుడు మంత్రపాలుడనే రాజు ఏలేవాడు. ఆయన భార్య పేరు చంద్రమతి. వారికి హైమవతి అనే కుమార్తె ఉండేది. ఆ పిల్ల చాలా చక్కనిది. మణిప్రస్థం ఏలే కుంతిభోజుడి ఏడవ కుమారుడు జయభద్రుడు తమ కుమార్తెకు భర్త అయితే బాగుండునని వారు చాలారోజులు ఆశపడ్డారు. జయభద్రుడు చక్కనివాడు. జన్మతహా అతనికి రాజ్యాధికారం లేక పోయినా, అతని జాతకం చూసినవారు, అతను మహారాజవుతాడని చెప్పారు. తమ కుమార్తెను అతనికిచ్చి చేసినట్టయితే పిల్ల చాలా సుఖపడుతుందని మంత్రపాలుడూ, ఆయన భార్యా అనుకున్నారు. కాని వారి ఆశ త్వరలోనే నిరాశ అయింది. కుంతిభోజుడు తన కడగొట్టు కొడుకుకోసం కన్యాన్వేషణ చేస్తూ కబురైనా చెయ్యలేదు.

"ఏంచేస్తాం? వారి తాహతుకు మనం చాలలేదు." అనుకుని మంత్రపాలుడు హైమవతికి ఇతరత్రా పెళ్ళిప్రయత్నాలు సాగించాడు. అదేమి పాపమోగాని, హైమవతికి సర్వలక్షణాలు గల సంబంధం ఒకటీ రాలేదు. ఉన్నవాటిలో మెరుగుగా కనబడినవి రెండే. వారిలో ఒకడు కళింగ రాజు కొడుకు గుణవర్మ, రెండోవాడు లలాటరాజు కొడుకు ధనవర్మ. ధనవర్మకు లక్ష్మి వున్నది గాని సరస్వతి లేదు. గుణవర్మకు చదువున్నది గాని డబ్బు లేదు; వాం రాజ్యం అప్పులపాలై వున్నట్టుకూడా తెలియవచ్చింది.

ఈ రెంటిలో గుణవర్మ సంబంధం హైమవతి తండ్రికి నచ్చింది. ఆమె తల్లికి ధనవర్మ సంబంధం నచ్చింది. ఇద్దరూ అభిప్రాయాలు కలవక కొంత తగాదాపడ్డ మీదట మంత్రపాలుడు, తనను అడ్డేవారు

సి. జగన్నాధరావు



లేరు గనక గుణవర్మ సంబంధం నిశ్చయం చేసి, ముహూర్తం పెట్టించి, లగ్నపత్రిక పంపించి, వివాహయత్నా లారంభించాడు.

స్వతంత్రం లేనిదైనా చంద్రమతి, తన కుమార్తెను ధనవర్మకే ఇచ్చిచేయాలనే పట్టుదలతో, రహస్యంగా పెళ్ళికి తరలి రమ్మని లాలూచీగా లలాట దేశానికి కబురు పంపింది. పెళ్లికి గుణవర్మ సపరివారంగా మేళతాళాలతో తరలివస్తే, ధనవర్మ చడీ చప్పుడూ లేకుండా తానుకూడా తరలి వచ్చాడు. రాజుగారు ఏర్పాటుచేసిన విడిదిలో గుణవర్మ బహిరంగంగా విడిదిచేస్తే, ఊరి మరొక మూల రాణిగారు రహస్యంగా ఏర్పాటుచేసిన సత్రంలో ధనవర్మ సపరివారంగా విడిదిచేశాడు.

హైమవతిని పెళ్ళికూతుర్ని చేశారు. కొద్దిసేపట్లో ముహూర్త మనగా చంద్రమతి హైమవతిదగ్గిరికి వచ్చి, "అమ్మాయి, నువు సుఖపడదలుచుకుంటే నేను చెప్పినట్టు చెయ్యి. ఒక గంపలో నిన్ను కూర్చొబెట్టి అసలు పెళ్లికొడుకుదగ్గిరికి పంపుతాను. దీనికి ఒప్పుకోకపోతివా, నిన్నా దరిద్రుడు గుణవర్మ కిచ్చి ముడిపెట్టేస్తారు!" అన్నది.

తల్లి తన మేలు కోరే ఈ పని చేస్తున్నదని అనుకుని హైమవతి గంపలో కూర్చుని వెళ్ళిపోవటానికి ఒప్పుకున్నది. ఆమెను గంపలో కూచోబెట్టి పైన ఒక చీర కప్పి వాసెనలాగా కట్టారు. గంపకు గల చిల్లుల మూలాన హైమవతికి ఊపిరాడటమే గాక బయట జరిగేదంతా కనిపిస్తున్నదికూడా.

హైమవతి కూర్చున్న గంపను ఒక పరిచారిక తన నెత్తిన పెట్టుకుని సత్రంకేసి పోసాగింది. ఆమె రాజసౌధంలో తిరిగే పరిచారికే గనక రాజభటులు అడ్డగించలేదు. కాని ఈ పరిచారిక సత్రందాకా పొయ్యేలోపలే ఒక అవాంతరం జరిగింది. సత్రంలో రహస్యంగా బసచేసిన పెళ్ళివారి అజాగ్రత్త వల్ల చుట్టుపక్కల ఇళ్ళు అంటుకున్నాయి.

ఇళ్ళలో సామానంతా వీధికి అడ్డంగా పెట్టారు కాలుతున్న ఇళ్ల చప్పుడూ, జనం చేసే కోలాహలమూ మొదలైనవాటితో ఆ ప్రాంతమంతా అల్లకల్లోలంగా ఉంది.

పరిచారిక, పాపం, శ్రమపడి ఏవిధంగానైనా సత్రం చేరుదామని యత్నిస్తుండగా ఎవరో అడ్డగించి, తట్ట దింపించారు. అది ఎవతో, వీధిలో వేసిన వస్తువులు ఎత్తుకుపోతున్నదని వారనుమానపడ్డారు. వారు తట్టలో చూస్తే తన రహస్యం బయటపడుతుందని దాసీది దొంగలాగా నటిస్తూ పారిపోయింది. అందులో ఏమున్నదో చూడాలన్న ఆత్రం ఎవరికీ కలగలేదు.

ఇంతలో గుర్రాలెక్కి పెద్దమనుషులల్లే వేషాలు వేసుకుని అసలు దొంగలే వచ్చారు. వీధిలో పరిచిన వస్తువులలో పెద్దవిగా కనబడేవి తలా ఒకటి గుర్రాలమీదికెత్తుకుని తాపీగా వెళ్ళిపోయారు. వారిలో ఆఖరు దొంగ ఏమీ దొరక్క హైమవతి ఉండిన గంప ఎత్తుకున్నాడు. వారంతా పెళ్ళివారనుకుని ఎవరూ వారినడ్డగించలేదు.

తెల్లవారేసరికల్లా దొంగలు అరణ్యం మధ్య చేరుకున్నారు. హైమవతి ఉండిన గంప తప్ప మిగిలిన సామానంతా గుర్రాల మీదినుంచి దించారు. ఆ గంపలో పువ్వులో పళ్ళో ఉంటాయని వారి ఉద్దేశం! దొంగ





లందరూ తాము కొల్లగొట్టిన ధనాన్ని పంచుకొవటంలో నిమగ్నులై ఉన్న సమయంలో, గంప ఉండిన గుర్రం నీటికోసమో ఏమో, అదుపుచేసే రౌతు లేక, తన యిష్టం వచ్చినట్టు అడవిన పడి పోసాగింది. కొంతదూరం వెళ్ళాక తట్ట పక్కకు ఒరిగి ఒకచోట కింద పడిపోయింది.

హైమవతి తట్టలోనుంచి పైకి వచ్చి చూసింది. చుట్టూ భీకరారణ్యం. ఎక్కడా జనసంచారం లేదు. గుర్రంకూడా ఎటో వెళ్లిపోయింది. దిక్కు తెలియక ఆమె కనపడిన కాలిబాటలు పట్టి పోసాగింది. ఆకలి దప్పులామెను బాధించసాగాయి.

సాయంకాలమయింది. చీకటిపడేలోగా తాను ఆ అడవిలోనుంచి బయటపడగలనని ఆమెకు తోచలేదు.

ఇంతలో భయంకరంగా గాండ్రిస్తూ ఒక పొద వెనకనుంచి పెద్దపులి ఒకటి ఎదురొచ్చి ఆమెనుచూసి ఆగింది. హైమవతి కెవ్వున అరిచి మూర్ఛపోయింది. ఆమెకు మూర్ఛ తెలిసేసరికి, పెద్దపులిని మించి వికృతంగా కనిపించే ఒక ఆటవికుడి ముఖం ఆమెకు కనబడింది. ఆ ఆటవికుడే దూరంనుంచి సమయానికి పెద్దపులిని చూసి, బాణంతో కొట్టి హైమవతిని కాపాడాడు.

వాడి ముఖం వికారమైనా హృదయం మంచిది. "అమ్మా, చీకటిపడుతోంది. ఇది అసలే పులుల అడివి. ఈరాత్రికి మాయింట పడుకుందువు రా. తెల్లవారి నిన్ను అడివి దాటిస్తాను," అన్నాడు వాడు. ఇద్దరూ కలిసి బయలుదేరారు. హైమవతిని గురించి ఆలోచించటంలో ఆ దౌర్భాగ్యుడు తాను చంపిన పులిని పట్టుకుపోవటం మరిచిపోయాడు.

వాడు హైమవతిని వెంటబెట్టుకుని ఇంటికి పోగానే వాడిభార్య మండిపడి, "ఈ పెళ్ళికూతురెవతెరా?" అని అడిగింది. ఆటవికుడు జరిగిందంతా చెప్పాడు తన మొగుడు పులిని చంపికూడా తీసుకురాక

పోవటానికి కారణం హైమవతేనని అనుకుని, ఆటవికుణ్ణి వాడి భార్య చచ్చేటట్టు కొట్టి, రక్కి, జుట్టు పీకి తనవాళ్ళను పిలుచుకు వచ్చింది. వాళ్ళు ఉభయపక్షాలూ విని తీర్పు చెప్పారు:

"దీనిమూలంగా మీకు తగాదా వచ్చింది గనక దీన్ని మేం తీసుకుపోయి నూతిలో పారేస్తాం. నీకు నిజంగా దీనిమీద భ్రమ లేక పోతే ఈ తీర్పుకు ఒప్పుకో."

ఆటవికుడు ఒప్పక చేసేదిలేదు. ఒప్పుకోనంటే వాడి పెళ్లాం అనుమానం రూఢి అవుతుంది; అందరూ కలిసి వాణ్ణి చంపేస్తారు కూడా. ఆటవికులందరూ హైమవతిని పట్టుకుపోయి కొంత దూరంలో ఉన్న లోతైన పాడుబావిలో పారేసి తమదారిన తాము పోయారు.

అయితే హైమవతికి అక్కడ చావు రాసిపెట్టిలేదు. ఆమె ఆ బావిలో పెరిగే ఒక కొమ్మను పట్టుకుని రాత్రల్లా దానిని కరుచుకొని కూచుంది. మర్నాడు తెల్లవారి ఒక జాము గడిచాక ఎవరో ఆ బావిలోకి తొంగి చూశారు, వారికి హైమవతి కనబడింది.

ఆవిధంగా ఆ బావిలో ఉన్న హైమవతిని చూసి కాపాడినవాడు మరెవరో కాదు, మణిప్రస్థం ఏలే కుంతిభోజుడి ఏడవ కుమారుడు జయభద్రుడే. అతను ఆ కిందటిరోజే






వేటకు వచ్చి, దారితప్పి, తెల్లవారగానే నీటి కోసం వెతుకుతూ అటుగా వచ్చాడు. హైమవతిని చూడగానే అతను సమీపాన ఉన్న మర్రిఊడలు తాడుగా ముడివేసి, దాని సహాయంతో బావిలోకి దిగి హైమవతిని పట్టుకున్నాడు. అతని చేతుల్లోనే ఆమె స్పృహతప్పి పడిపోయింది.

ఆమె పెళ్ళికూతురి వేషం చూసి జయభద్రుడు మరింత ఆశ్చర్యపడ్డాడు. ఆమెకు స్పృహ వచ్చాక విషయమంతా తెలుసుకున్నాడు. ఈ సమయంలోనే ఒక గుర్రం అటుగా వచ్చింది. అది దొంగల గుర్రమే. జయభద్రుడు హైమవతిని గుర్రంమీద ఎక్కించి తానుకూడా వెనక ఎక్కి పోసాగాడు. సాయంకాలమయేసరికి వారొక గ్రామం చేరి, ఒక సత్రంలో ప్రవేశించి ఆరాత్రి అక్కడే వండుకుతిని, అసలే బడలి ఉండటంచేత నిద్రపోదామని పడుకున్నారు.

ఆరాత్రి ఆ సత్రానికి కొందరు బ్రాహ్మలు వచ్చి చేరారు. వారు అరుగుమీద పడుకుని కబుర్లు చెప్పుకోసాగారు. వారి సంభాషణ ద్వారా అమరావతిలో జరిగిన విషయాలు కొన్ని హైమవతికి తెలిశాయి.

రాణి చంద్రమతి రహస్యంగా మరొక సంబంధం చెయ్యటానికి యత్నాలు చేసినట్టు రాజుకు తెలిసింది. పెళ్లికూతురు హైమవతికోసం వెతికారు. ఆమె కనిపించక పోయేసరికి, గుణవర్మా, ధనవర్మా ఏకమై, మంత్రపాలుడు తమ ఇద్దరినీ పరాభవించటానికి ఇంతపని చేశాడని ఆగ్రహించి, ఆ రాజునూ, రాణీనీ నిర్బంధంలో పెట్టి సాధించసాగారు.

ఈ వార్త వినగానే హైమవతి తన తల్లిదండ్రుల స్థితి తలుచుకుని ఏడవసాగింది. జయభద్రుడామెను ఓదార్చి, "నువ్వేమీ భయపడకు. మనం అమరావతి పోదాం. గుణవర్మనూ, ధనవర్మనూ ఏదోవిధంగా మోసగించి నీ తలిదండ్రులను నేను

కాపాడతాను. కాని వారిద్దరిలో నీ కెవరిని పెళ్లాడాలని ఉందో నాకు చెప్పు!" అన్నాడు.

"నా కా దుర్మార్గులు అక్కర్లేదు," అన్నది హైమవతి. కాని తన కెవరు కావాలో చెప్పలేదు. జయభద్రుడు గుచ్చి అడగనూలేదు.

వారు ఒక్కొక్క గ్రామమే దాటుతూ ప్రయాణం సాగించారు. దారివెంబడి ఖర్చు కోసమని హైమవతి తన ఆభరణాలు ఒక్కొక్కటే అమ్ముతూ రాసాగింది. వారి అవసరం కనిపెట్టి వర్తకులు అతి చవుకగా వాటిని తీసుకున్నారు. కాని లాభం గూబల్లోకి వచ్చిందన్నట్టు, హైమవతికోసం వెతికే రాజభటులు ఈ వర్తకులవద్ద వుండిన హైమవతి ఆభరణాలను గుర్తించి వారిని బంధించి పట్టుకుపోయారు.

కాలక్రమాన జయభద్రుడూ, హైమవతీ అమరావతి చేరారు. జయభద్రుడు హైమవతిని మారువేషంలో ఒకచోట వుంచి, మారుపేరుతో రాజభవనానికి వెళ్లాడు. గుణవర్మతోనూ, ధనవర్మతోనూ పరిచయం చేసుకున్నాడు. ఈ పరిచయం త్వరలోనే స్నేహంగా పరిణమించింది.

ఒకనాడతను ధనవర్మతో, "మీరు హైమవతి జాడ తెలియక చాలా ఇబ్బంది పడుతున్నారు. నాకు వెయ్యి రూపాయలు





ఇప్పించినట్టయితే ఆమెను ప్రత్యక్షంగా మీకు చూపించగలను," అన్నాడు.

ధనవర్మ తక్షణమే రెండువేల రూపాయలిస్తూ, "చెప్పు, హైమవతి ఎక్కడుంది?" అని అడిగాడు.

"మరెక్కడుంటుంది ? గుణవర్మ అధీనంలోనే వుంది. తనకు తెలియనట్టు నటిస్తున్నాడు !" అన్నాడు జయభద్రుడు.

ధనవర్మ "రుజువు చేస్తావా?" అన్నాడు.

"ఈ రాత్రే రుజువు చేస్తాను," అన్నాడు జయభద్రుడు.

అతను ఇదేవిధంగా గుణవర్మ దగ్గిరికి వెళ్లి, హైమవతి ధనవర్మ అధీనంలోనే వున్నదనీ, కావలిస్తే ఆ రాత్రే చూపిస్తాననీ అతనికి మాట ఇచ్చాడు.

తరవాత జయభద్రుడు ఒక పెద్ద భవనం అద్దెకు తీసుకుని ఇల్లంతా చక్కగా అమర్చాడు. అందులో హైమవతిని ప్రవేశ పెట్టాడు. ఆమెకు మామూలు వేషం వేయించాడు. అర్ధరాత్రిదాకా ఆమెతో వీణ వాయిస్తూ మేలుకొని ఉండమని చెప్పాడు. రాత్రి జాము పొద్దుపోయాక ఆ ఇంటివద్దకు రావలిసిందని ధనవర్మకూ, గుణవర్మకూ కబురుచేశాడు.

ఆ రాత్రి ముందుగా ధనవర్మ వచ్చాడు. జయభద్రుడతనికి కిటికీలోనుంచి హైమవతిని చూపాడు తనదగ్గిర ఉన్న ప్రతిమనుబట్టి ధనవర్మ హైమవతిని గుర్తించి, "గుణవర్మ ఎక్కడ?" అని అడిగాడు.

"వచ్చేవేళ అయింది. చూపిస్తాను," అంటూ జయభద్రుడు, మరొక పక్కనుంచి అతన్ని ఇంట్లో ప్రవేశపెట్టాడు. ఇంట్లో ప్రవేశించగానే అక్కడ ఒక నడవ వున్నది. ఆ నడవకు ఒక పక్కగా రెండు గదులున్నాయి. అందులో మొదటిదానిలో ధనవర్మను దాచి, "తలుపు సందులలోనుంచి చూస్తూవుండండి. గుణవర్మ లోపలికి వెళ్లేటప్పుడు కనిపిస్తాడు," అన్నాడు.



మరి కొంతసేపటికి గుణవర్మ వచ్చాడు, ధనవర్మలాగే కిటికీలనుంచి హైమవతిని చూసి గుర్తించాడు. గుణవర్మను పక్క వాకిలినుంచి రమ్మని తాను మరొకదారిన రెండో గది దగ్గిరికి వచ్చాడు. గుణవర్మ రెండో గదికి వాయే సమయంలో ధనవర్మ తలుపు సందులనుంచి చూశాడు.

తరవాత జయభద్రుడు ధనవర్మ వున్న గది తలుపు తెరిచి, వచ్చినదారిన కాకుండా రెండవ దారిన బయటికి పంపేశాడు. ఆ సమయంలో గుణవర్మ ధనవర్మను తలుపు సందుల్లోనుంచి చూశాడు. తరవాత గుణవర్మనుకూడా జయభద్రుడే పంపేశాడు.

ఇంత తతంగం చేసిన ఫలితంగా గుణవర్మా, ధనవర్మా ఒకరికొకరు బద్ధశత్రువులైపోయారు. "ఈ దుర్మార్గుడు ఇంత కాలమూ హైమవతిని తనదగ్గిరె ఉంచుకుని ఏమి ఎరగనట్టు నన్ను మోసంచేస్తాడా?" అని ధనవర్మమీద గుణవర్మకూ, గుణవర్మమీద ధనవర్మకూ పట్టరాని ఆగ్రహం కలిగింది. మర్నాడుదయం వారు రాజసభకు వస్తూనే, మామూలుప్రకారం ఒకరి నొకరు కౌగిలించుకుని, ఒకరి వీపులో ఒకరు కత్తులు పొడుచుకుని, అందరూ చూస్తుండగానే చచ్చిపోయారు.

వెంటనే జయభద్రుడు హైమవతి తల్లిదండ్రులను చెర విడిపించాడు. హైమవతి నగలను చౌకగా కొన్న వర్తకుల సొమ్ము వారి కిప్పించి, వారినికూడా బంధవిముక్తులను చేయించాడు

హైమవతికీ జయభద్రుడికీ వైభవంగా పెళ్ళి జరిగింది. తాము అనుకున్న సంబంధాలకన్నకూడా మంచి సంబంధం హైమవతికి దొరికినందుకు రాజూ, రాణీ ఎంతో సంతోషించారు. హైమవతి నగలను చౌకగా కొనిన వర్తకులుకూడా పెళ్లికి ఉండిపోయి వధూవరులకు గొప్పగా కానుకలూ, కట్నాలూ చదివించారు.





# ఉత్తమవిద్య

పూర్వం జ్ఞానప్రియుడనే యువకుడు చిన్నతనంనుంచీ కాశీలో ఉండి, గొప్ప గొప్ప గురువులకు శుశ్రూషచేసి సకల విద్యలూ అభ్యసించాడు. అతని పాండిత్యానికీ, శాస్త్ర పరిజ్ఞానానికీ ప్రతివారూ మెచ్చుకున్నవారే.

కాని జ్ఞానప్రియుడికి ఒకవిధమైన అసంతృప్తి పట్టుకున్నది. "ఇన్ని విద్యలు నేర్చుకున్నానుగాని, జీవయాత్ర సుఖంగా సాగించటానికి ఇందులో ఒక్కటీ పనికి రాదు. నా చదువులో ఏదో లోటున్నది. అది పూర్తి చేస్తేగాని సంసార సాగరంలో అడుగుపెట్టను," అనుకున్నాడతను.

జ్ఞానప్రియుడు ఎందరో పండితుల దగ్గిరికి వెళ్లాడు. తాను చదివిన విద్యలన్నీ వారికి చెప్పి, "నా చదువు పూర్తికావటానికి నేనింకేమి చదవాలో దయచేసి చెప్పండి!" అని అడిగాడు. వారు అంతా విని, "నీ చదువంతా ముగిసింది," అన్నారు.

ఒక్క వృద్ధుడు మటుకు, "నాయనా, నీ చదువింకా కొద్దిగా దిగబడివున్నది. కాని నీ కా విద్య నేర్పగలవాడు ఒక్కడే ఉన్నాడు. అతను కమ్మరి వృత్తి చేసుకుంటూ ఫలాని గ్రామంలో ఉంటాడు. అతనికి శుశ్రూష చేస్తివా, నీ చదువు పూర్తి అవుతుంది," అని చెప్పాడు.

జ్ఞానప్రియుడికి వృద్ధుడి మాటలయందు గురి కుదిరింది. తన చదువు పూర్తి అవుతుందిగదా అన్న ఆనందంకూడా కలిగింది. ఆయన చెప్పినప్రకారం ఆ కమ్మరిని వెతుక్కుంటూ, ఆయన వుండే గ్రామానికి వెళ్లాడు. కొలిమికి తిత్తివేస్తున్న కమ్మరి ముందు సాష్టాంగపడి, "సకల విద్యలూ పూర్తిచేశాను. కాని నా చదువు ఇంకా కొంచెం మిగిలిపోయింది. అనుగ్రహించి జీవితానికి అక్కరకువచ్చే విద్య నేర్పండి" అని జ్ఞానప్రియుడు వేడుకున్నాడు.

ఎస్. వెంకటసుబ్బయ్య

కమ్మరి కొలిమి ముందునుంచి లేచి, "అట్లా కూచుని తిత్తివెయ్యి," అన్నాడు. జ్ఞానప్రియుడు కొలిమి ముందు కూచుని తిత్తి వెయ్యసాగాడు.

ఆరోజు గడిచింది, ఆ వారం గడిచింది, ఆ నెల గడిచింది, ఆ సంవత్సరంకూడా గడిచింది. జ్ఞానప్రియుడు రోజూ తిత్తి వేస్తూనే ఉన్నాడు. కమ్మరి అతనితో ఏమీ మాట్లాడనేలేదు. "నే నెందుకు వచ్చానో అయనకు తెలుసుకదా! మళ్ళి జ్ఞాపకం చెయ్యడం దేనికి?' అని జ్ఞానప్రియుడు కూడా మాట్లాడక ఊరుకున్నాడు.

కాని తాను వచ్చి సంవత్సరం నిండినా గురువుగారు తన సంగతి ఎత్తకపోవటం గురించి జ్ఞానప్రియుడు ఖిన్నుడై, తిత్తి వెయ్యటం ఆపి, ఒకనాడు, కమ్మరితో, "స్వామి, నా చదువు—" అన్నాడు.

"తిత్తి వెయ్యి!" అన్నాడు కమ్మరి.

అంతే, గురువు అంతకంటె ఇంకేమి అన లేదు. జ్ఞానప్రియుడుకూడా మళ్ళీ ఆ ప్రశంస ఎత్తలేదు.

ఈవిధంగా అయిదేళ్లు గడిచాయి.

ఒకనాడు ఉదయం జ్ఞానప్రియుడు కొలిమివద్దకు వచ్చి కూచుని తిత్తి చేత పట్టుకుంటుండగా కమ్మరి వచ్చి అతని భుజంమీద చెయ్యివేశాడు. జ్ఞానప్రియుడు లేచి నిలబడి నమస్కారంచేసి, "ఏమిటి, గురూ?" అన్నాడు.

"నాయనా, నీ చదువు పూర్తిఅయింది. నువ్వింక ఇంటికి పోయి, పెళ్లాడి, సుఖంగా సంసారం ఈదగలవు. అన్ని విద్యలనూ మించిన సహనం సంపాదించుకున్నావు!" అన్నాడు కమ్మరి.

జ్ఞానప్రియుడు పరమానందభరితుడై తన గురువువద్ద సెలవు పుచ్చుకుని ఇంటికి వెళ్ళిపోయి, గృహస్థ ధర్మం స్వీకరించి కలకాలం సుఖంగా జీవించి, గొప్ప జ్ఞాని అనిపించుకున్నాడు.






ఒక పట్టణంలో ఒక పేదరాలుండేది. ఆమె భర్త చాలా మంచిపేరు తెచ్చుకున్నాడు గాని దమ్మిడీకూడా వెనకవెయ్యకుండా, తన భార్యనూ, కుమారుణ్ణీ కడు బీదస్థితిలో ఉంచి చనిపోయాడు. అతని కొడుకుపేరు "నిద్రమొహం" రంగడు.

తండ్రి పోయేసరికి రంగడికి పదిహేనేళ్ళు. కాని వాడికి కూచున్న చోటనుంచి కదిలే ఓపిక ఉండేదికాదు. వట్టి మన్ను తిన్న పాము. వాడు ఎప్పుడు చూసినా పడుకుని నిద్రపోతూ వుండేవాడు. లేచి తిరుగుతూవుండగా, ఏదైనా పని చేస్తూండగా వాణ్ణి చూసినవారెవరూ లేరు.

"వాణ్ణి దేవుడు అట్లా సృష్టించాడు. ఏంచేసాం?" అనుకుని రంగడి తల్లి, వాణ్ణి రొష్టుపెట్టకుండా, తానే నాలుగిళ్ళూ తిరిగి, దొరికిన కూలీచేసుకుని, ఆ డబ్బులతో తన పొట్టా తన కొడుకుపొట్టా నింపుతూండేది. రంగడు తల్లి లేపినప్పుడు లేచి అన్నంతిని మళ్ళా పడుకుని నిద్రపోయేవాడు.

రంగడి ఇంటిపొరుగునే ఒక వర్తకుడుండేవాడు. ఆయనపేరు వరహాలశెట్టి. ఆయన వర్తకంమీద చీనాకు పోతున్నాడని రంగడి తల్లి విన్నది. అదృష్టవశాత్తూ ఆమెకు అప్పుడే నెలజీతం ముట్టింది. అందులో అయిదు వెండికాసులు తీసి రంగడికిచ్చి ఆవిడ, "నాయనా, వీటిని వరహాలశెట్టికిచ్చి, తిరిగి వచ్చేటప్పుడు చీనానుంచి ఇది పెట్టి ఏదన్నా సరుకు తెచ్చిపెట్టమను. దానితో నువు వర్తకంచేసుకుని బతుకుదువుగాని," అన్నది.

తల్లి పోరగా, పోరగా రంగడు ముక్కుతూ, మూలుగుతూ లేచాడు, ఆవలించాడు. తల్లి దగ్గిర అయిదు కాసులూ తీసుకుని, నిద్రమత్తుగా నడుస్తూ వరహాలశెట్టి వద్దకు వెళ్ళి, తల్లి చెప్పిన నాలుగు ముక్కలూ చెప్పాడు.

ఆర్. చిదానందమూర్తి




రంగణ్ణి చూస్తే వరహాలశెట్టికి జాలి వేసింది. ఆ కొద్దిడబ్బుతో ఈ రంగడు వర్తకం చేసేదేమిటి? బాగుపడేదేమిటి? ఈ సంగతి తెలిసికూడా, దయాగుణం గలవాడు కావటంచేత వరహాలశెట్టి, "అలాగే, నాయనా!" అంటూ అయిదు వెండి కాసులూ తీసుకున్నాడు. రంగడు మళ్ళీ ఇంటికి తిరిగి పోయి హాయిగా పడుకుని నిద్రపోయాడు.

వరహాలశెట్టి తోటి వర్తకులందరినీ కలుపుకుని, ఓడ మాట్లాడుకుని, మంచి ముహూర్తం నిర్ణయించి లంగరు ఎత్తించాడు. అదృష్టవశాత్తూ దారిపొడుగునా గాలి అనుకూలించింది. ఓడ రేవుపట్టినచోటల్లా వర్తకులకు క్రయవిక్రయాలు బాగా సాగాయి. చివరకు ఓడ చీనాదేశం చేరింది. అక్కడ వర్తకులందరూ తాము తెచ్చిన సరుకులు పూర్తిగా అమ్మేసి మారుబేరానికి చీనాంబరాలూ, దంతపు సామానులూ, రత్నాలూ మొదలైనవి ఎవరి శక్తికొద్దీ వారు కొనుక్కున్నారు. మళ్ళీ ఓడ తిరుగు ప్రయాణమయింది.

పది రోజులు గడిచాక వరహాలశెట్టికి అకస్మాత్తుగా రంగడిచ్చిన అయిదు వెండి కాసులమాటా జ్ఞాపకం వచ్చింది. అది పెట్టి ఏదైనా సరుకు కొనితెచ్చిపెట్టమన్నాడు రంగడు. వర్తకం అడావుడిలో శెట్టి ఆ విషయమే మరిచాడు. పోనీ తాను కొన్న వాటిలో ఏదైనా రంగడికిద్దామా అంటే అంత చవుక వస్తువు ఏదీ లేదు.

వరహాలశెట్టి మిగిలిన వర్తకులతో, "ఓడను మళ్ళా చీనాకు తీసుకుపోదాం. ఇలా నావల్ల పొరపాటు జరిగిపోయింది," అన్నాడు. వారెవ్వరూ అందుకు ఒప్పుకోక, "కావలిస్తే మేమంతా తలా ఒక అయిదు మొహరీలూ చందా వేసుకుని ఆ కుర్రవాడికి ఇచ్చుకుంటాం. ఓడమాత్రం వెనక్కు తిప్పవద్దు!" అన్నారు.

కొన్నాళ్ళు గడిచాక ఓడ తూర్పుదీవుల్లో ఒకరేవు చేరుకున్నది. ఓడ దగ్గిరికి బిచ్చగాళ్లు చాలామంది వచ్చారు వారిలో ఒకడి వెంట మూడు కోతులున్నాయి. అందులో రెండు చలాకీ అయినవి, యజమాని ఏ ఆట ఆడమంటే ఆ ఆట ఆడగలవి. మూడో కోతి ముసలిది. దానికి ఒక్క ఆటా వచ్చినట్టు కనబడలేదు. మిగిలిన రెండూ ఆడుతుంటే అది దిగులు ముఖంపెట్టి సముద్రంమీదికి చూస్తూ కూచుంది.

ఆ కోతులను చూస్తుంటే వరహాలశెట్టి కొక ఆలోచన వచ్చింది. రంగడిచ్చిన అయిదు వెండి కాసులతో ఒక కోతిని కొనుక్కుపోయి ఇస్తే తన బాధ్యత తీరిపోతుందనుకున్నాడు శెట్టి.

"ఒరేయ్, ఆ కోతుల్లో ఒకటి అమ్ముతావా? అయిదు కాసులిస్తాను!" అన్నాడు శెట్టి కోతులాడించేవాడితో.

"ఈ ముసలి కోతిని తీసుకోండి, బాబూ!" అన్నాడు వాడు.

"పడుచు కోతి నివ్వరాదురా?" అన్నాడు శెట్టి.

"వాటిని నూరు కాసులకూడా ఇవ్వను, బాబూ. అవే నా బతుకుతెరువు. ఈ ముసలిమొద్దును అయిదు కాసులకు కొన్నాను. తిండి దండగె తప్ప ఒక్క ఆటా



రాదు. నేర్పినా నేర్చుకోదు. దాన్ని తీసు కోండి, బాబూ!" అన్నాడు కోతులనాడించే వాడు బతిమాలుతూ.

చేసేదిలేక వరహాలశెట్టి ముసలికోతిని కొని ఓడ ఎక్కాడు. అదికూడా రంగడి లాటిదిగానే కనబడింది. తిండి తినేటప్పుడు తప్ప మిగిలిన అన్నివేళలా కునికిపాట్లు పడుతూ వుండేది. దాన్ని కట్టివేసే అవ సరంకూడా లేకపోయింది.

మరికొంత కాలానికి ఓడ ముత్యాల దీవి చేరింది. ఈ దీవిచుట్టూ సముద్రంలో ముత్యపు చిప్పలు దొరుకుతాయి. ఈ దీవిలో ఉండే పల్లెవాళ్ళు, వర్తకులు వచ్చినప్పుడు నీటిలో ఈది ముత్యపు చిప్పలు పట్టుకు వచ్చి చౌకగా అమ్ముతూంటారు. వర్తకుల అదృష్టాన్నిబట్టి ఒక్కొక్కసారి ఒక్కొక్క వర్తకుడికి ముత్యపు చిప్పల్లో పెద్దపెద్ద ముత్యాలు దొరుకుతాయి. అదృష్టం లేని వారికి ముత్యపు చిప్పల వెలకూడా గిట్టదు.

ఈ ఓడ ఈ దీవికి వచ్చింది ముత్యపు చిప్పలకోసమే. ఓడ రేవుచేరగానే పల్లె కుర్రవాళ్ళు కేకలు వేసుకుంటూ పరిగెత్తు కుంటూ వచ్చి నీటిలోకి దూకారు. అంత దాకా మన్నుదిన్న పాములాగా కూర్చుని ఉండిన కోతి ఈ కుర్రాళ్ళ కేకలు విని లేచి



ఒక్క దూకున ఓడలోనుంచి సముద్రం లోకి దూకింది.

పాపం, రంగడికి కోతికూడా దక్కదు కాబోలునని వరహాలశెట్టి భయపడ్డాడు. కాని కొద్దిసేపట్లో ఆ కోతి రెండు చేతులా ముత్యపు చిప్పలు రొమ్ముకు అదిమిపట్టు కుని ఈదుతూ వచ్చింది. ఓడలోకి ఎక్కి వాటిని ఒక చోట పెట్టి మళ్ళా సముద్రం లోకి దూకింది. చూస్తుండగానే అది దాదాపు ఒకవంద ముత్యపు చిప్పలు తెచ్చి పోగుపెట్టింది.

మిగిలిన వర్తకులు ఎవరికితోచినన్ని ముత్యపుచిప్పలు వారు కొనుక్కున్నారు.

ఏ ఒకరికి రెండు మూడు ముత్యాలు మించి దొరకలేదు. అవయినా చాలా చిన్నవి. కొందరు అదృష్టహీనులకు ఒక్క ముత్యమూ దొరకలేదు. కాని కోతి తెచ్చిన ముత్యపుచిప్పలలో అనేక పెద్ద ముత్యాలూ, చిన్నముత్యాలూ దొరికాయి.

దీనికి కారణం ఉన్నది. ఈ ముసలి కోతి ఒకప్పుడు ఈ ముత్యాల దీవిమీదనే వుండేది. దీని యజమాని ఒక పల్లెవాడు. వాడు దీనికి ముత్యపు చిప్పలు పట్టుకు రావటం నేర్పాడు కొంతకాలానికి వాడు చనిపోయాడు. తరవాత దాన్ని ఏ పడవ కళాసులో పట్టుకుని కొంతకాలం పెంచారు. అది అస్తమానం నిద్రమత్తుగా ఉండటం చూసి, దాన్ని మరొకదీవిలో కోతులాడించు కునే వాడికి చౌకగా అమ్మారు. అదే ఇప్పుడు రంగడి సొత్తయి, అప్పుడే వాడి కొక నిధి పోగుచేసిపెట్టింది. కోతులనాడించే వాడు ఈ కోతిని తనవద్ద అంతకాలం ఉంచుకునికూడా దాని విలువ తెలుసుకో లేకపోయాడు.

వరహాలశెట్టి రంగడి ముత్యాలన్నీ భద్రంగా దాచి తన పట్టణం చేరగానే వాటని రంగడికి వప్పజెప్పాడు. అన్న ప్రకారం వర్తకులంతా రంగడికి తలా ఐదు బంగారు మొహర్లూ ఇచ్చుకున్నారు.

ఆ సొమ్ముతో రంగడు చక్కని మేడ కట్టించుకుని ముత్యాల అమ్మకంతో చాలా ధనవంతుడైనాడు. ముత్యాలదీవి చూడ గానే కోతికి మత్తు వదలిన ట్టే చేసేటందుకు పని కనబడగానే రంగడి మత్తుకూడా వది లింది. అతను ఏడాదికొకసారి తన కోతిని తీసుకుని ఓడమీద ముత్యాలదీవికి వెళ్ళే వాడు, ముత్యపు చిప్పలు దొరికినన్ని తీసు కుని తిరిగి వచ్చేవాడు. బోలెడన్ని ముత్యాలు దొరికేవి. ఈవిధంగా రంగడు కొద్దికాలంలోనే గొప్ప ధనికుడై, పెళ్ళిచేసు కుని చాలాకాలం సుఖంగా బతికాడు.





# నకలు ఖలీఫా

పూర్వం బగ్దాద్‌నగరంలో మహా ధన సంపన్నుడైన రత్నవర్తకు డుండేవాడు. అయనవద్ద అంతులేని రత్నాలూ, చిత్రమైన పనితనం గల నగలూ మాత్రమే గాక, అయనకు అనేక మేడలూ, దుకాణాలూ, దొడ్లూ తోటలూ, స్థలాలూ ఉండేవి; వందలాది బానిసలుండేవారు.

ఆయన చనిపోగానే ఈ ఆస్తియావత్తూ అయన కుమారుడిదయింది. అతని పేరు మహమ్మదలీ. ఒకనాడు మహమ్మదలీ తన దుకాణంలో కూచుని పని చూసుకుంటూ ఉండగా, అనేకమంది పరిచారికలను వెంటబెట్టుకుని ఒక అపురూప సుందరి అతని దుకాణం ప్రవేశించి, అందమైన బంగారు పట్టెడలేమైనా ఉంటే చూపమని అడిగింది.

మహమ్మదలీకి ఆమెను చూస్తూనే ఆమెమీద అంతులేని ప్రేమ పుట్టుకొచ్చింది. అతను తనవద్ద ఉన్న నూరు రకాల నగిషీలు గల పట్టెడలూ తెచ్చి ఆమెముందు పెట్టాడు. ఆమె వాటిని చూసి, "ఇంత కన్న మంచివి లేవా?" అని అడిగింది.

మహమ్మదలీ కొంచెమైనా సందేహించకుండా, తన తండ్రి ఏనాడో లక్ష దీనారాలిచ్చి కొని ఇంట ఉంచిన పట్టెడను లోపలినుంచి తెప్పించి ఆమెకు చూపాడు. దాన్ని చూస్తూనే ఆమె ఆనందంతో పరవశురాలై "నాకిదే కావాలి. దీని ఖరీదెంత? ఎంతకైనా కొంటాను." అని అడిగింది.

ఆమెను చూసి ఆనందపరవశుడైపోయిన మహమ్మదలీ, "దానికి విలువ ఏమీ లేదు. నా బహుమతిగా తీసుకోవచ్చు," అన్నాడు.

కాని ఆమె దానిని ఊరికే తీసుకోవటానికి ఒప్పక, మహమ్మదలీ తండ్రి లక్ష దీనారాలు పెట్టి దానిని కొన్నట్టు తెలుసు

కె. సోమసుందరం




కుని, వడ్డీకింద మరి అయిదువేల దీనా రాలిస్తానన్నది. సొమ్ము పుచ్చుకోవటానికి మహమ్మదలీ పట్టెడ తీసుకుని ఆమె వెంట వాళ్ల ఇంటికి వెళ్లాడు.

అక్కడ అతను ఆ పట్టెడను తన చేత్తోనే ఆమె మెడకు పెట్టాడు. అది పెట్టు కోగానే ఆమె అతనికి రెట్టింపు అందంగా కనబడింది. అత నామెను బతిమాలుతూ, "ఆ పట్టెడ నీదే! నేనూ నీ వాణ్ణే! నన్ను అనుగ్రహించు" అన్నాడు.

ఆమె నవ్వి, "వెర్రివాడా! నాకుమాత్రం నీమీద ప్రేమ లేదనుకున్నావా? నీతో మాట్లాడటానికే పట్టెడ కొనే మిషమీద నీ దుకాణానికి వచ్చాను. కాని నేను ఉత్తమ కుల స్త్రీని. నా అన్న ఖలీఫావద్ద వజీర్‌గా ఉంటున్న జాఫర్. అందుచేత మనకు వివాహమయేదాకా నన్ను సువ్వంటటానికి వీల్లేదు," అన్నది.

ఆమె వజీరు సోదరి అని వినగానే మహమ్మదలీ గుండె చల్లబడిపోయింది. ఆమెతో తనకు వివాహం అసంభవ మను కున్నా డతను.

అతని నిస్పృహ చూసి ఆమె మళ్ళీ నవ్వి, "గొప్ప ఇంటి దాన్నయినంత మాత్రాన నేను స్వతంత్రురాలను కానను కున్నావా?" అంటూ ఆమె ఆ క్షణంలోనే కాజీని పిలిపించింది. కాజీ వారిద్దరికీ వివాహంచేసి వెళ్ళిపోయాడు.

మహమ్మదలీ విందులు కుడుస్తూ, సంగీతం వింటూ, ఒక మాసంపాటు ఆ యింటనే గడిపాడు. అన్నాళ్ళూ భార్యా భర్తలు ఒకరిని విడిచి ఒకరుండలేదు. అంతకాలమూ మహమ్మదలీ తన యింటిని గురించిగాని, దుకాణంగురించిగాని తలచిన పాపాన కూడా పోలేదు.

ఒకనాటి ఉదయం మహమ్మదలీ భార్య స్నానానికి వెళ్లిన సమయంలో ఒక ముసలిది వచ్చి, "ఖలీఫా భార్య జుబేదా

తమర్ని అవశ్యం చూడాలంటున్నది. వెంటనే బయలుదేరండి," అన్నది.

మహమ్మదలీకి చిక్కు వచ్చింది. అతని భార్య స్నానం ముగించి వచ్చి భర్త కనిపించకపోతే చాలా బాధపడుతుంది. ఖలీఫా భార్య పిలిస్తే పోకపోవటం అపచారమేమో!

జుబేదారాణిని చూడవెళ్ళానంటే భార్య తనను క్షమించకపోతుందా అనుకుని మహమ్మదలీ ముసలిదాని వెంట బయలుదేరాడు. జుబేదాకూ, తన భార్యకూ మధ్య పచ్చిగడ్డి వేస్తే భగ్గుమంటుందని, పాపం, మహమ్మదలీ ఏమాత్రమూ ఎరగడు!

"మా వజీర్ చెల్లెలు ఎటువంటివాణ్ణి వలచిందో చూతామని పిలిపించాను. ఆమెకు తగినవాడివే!" అని జుబేదా అతన్ని అభినందించి, కొంతసేపు అతనితో ఇష్టాగోష్ఠి జరిపి, అతను ఇంటికి తిరిగి వెళ్ళటానికి అనుమతి ఇచ్చింది.

అతను తిరిగి వచ్చేసరికి అతని భార్య పట్టరాని ఆగ్రహంతో ఉన్నది.

"దుర్మార్గుడా, ఆ జుబేదా దర్శనం చేసుకోవటానికి నన్ను విడిచి పోతావా? వెళ్ళినవాడివి తిరిగి ఏముఖంతో నన్ను చూడవచ్చావు?" అంటూ ఆమె చప్పట్లు చరిచి, "సవ్వాబ్!" అని కేకపెట్టింది.





కేకవింటూనే కత్తి చేతపట్టుకుని ఒక నౌకరు వచ్చాడు." ఈ ప్రేమద్రోహి తల తీసెయ్యి!" అన్నదామె.

తీరా మహమ్మదలీకి శిరచ్ఛేదం జరగబోయే క్షణంలో, ఇంటోవున్న దాసీసజనమంతా వచ్చి తమ యజమానురాలి కాళ్ళూ చేతులూ పట్టుకుని, అతను నేరక అపచారం చేశాడనీ, అంత కఠినశిక్ష విధించటం ధర్మంకాదనీ చెప్పారు.

వారిమాట కాదనలేక ఆ ఇల్లాలు తన భర్తను నౌకర్లచేత కర్రలతోనూ, కొరడాలతోనూ తీవ్రంగా కొట్టించి, ఇంటినుంచి బయటికి గెంటించింది.

తనకు మించిన భార్యను చేసుకున్నందుకు ఈవిధంగా శిక్షాపరాభవాలు పొందినవాడై మహమ్మదలీ ఎట్లాగో ఇంటికి వచ్చిపడి, రెండు మాసాలు దెబ్బలతోనూ, గాయాలతోనూ తీసుకున్నాడు. తిరిగి వొళ్ళు చక్కబడగానే అతను, తన దుకాణానికి వెళ్లాడు. అందులో ఉన్న సరుకు పూచికపుల్ల మిగలకుండా అయినకాడికి అమ్మేసి డబ్బు చేసుకున్నాడు.

ఈ డబ్బుసహాయంతో మహమ్మదలీ తనకు జరిగిన అవమానాన్ని మరిచిపోవటానికి ఒక కార్యక్రమం అవలంబించాడు. ముందుగా నాలుగువందలమంది బానిసలను కొన్నాడు. వారందరికీ ఖరీదైన దుస్తులు వేశాడు. తనకు మరింత ఖరీదైన దుస్తులు కొనుక్కున్నాడు. తన బానిసలలో వజీర్ జాఫర్ పోలికలున్నవాణ్ణి ఒకణ్ణీ ఖలీఫావెంట వుండే వేత్రహస్తుడు, మస్రూర్ పోలికలున్నవాణ్ణి మరి ఒకణ్ణీ ఏరాడు. వారికి తగిన దుస్తులు వేయించాడు తాను ఖలీఫా దుస్తులు ధరించి ప్రతి రాత్రీ ఒక పడవలో ఎక్కి తన పక్కల నకలుజాఫర్‌నూ, నకలు మస్రూర్‌నూ కూచోబెట్టుకుని టైగ్రిస్‌నది వెంట బయలుదేరేవాడు. దీపాలకాంతితో

దేదీప్యమానంగా వెలుగుతూ పడవ నది వెంట వెళ్ళేటప్పుడు మహమ్మదలీ బానిసలు, "ఖలీఫా పడవ వస్తున్నది. తొలగండి. దారి తప్పుకోండి," అని కేకలు వేసేవారు. అది నిజంగా ఖలీఫాగారి పడవే ననుకుని నదిమీద వుండే ఇతర పడవలు ఒడ్డుకు చేరి మహమ్మదలీ పడవను యథేచ్ఛగా సాగి పోనిచ్చేవి.

మహమ్మదలీ పడవ నదివెంట కొంత దూరం వెళ్లి ఒక తోటవద్ద ఒడ్డుపట్టేది. ఆ తోటలో రాజభవనానికి తీసిపోని మేడ వుంది. అందులో మహమ్మదలీకోసమూ, అతని బానిసలకోసమూ విందు సిద్ధంగా ఉండేది. పాడే స్త్రీలూ, ఆడే స్త్రీలూ సిద్ధంగా వుండేవారు. మహమ్మదలీ తెల్లవార్లూ జల్సాగా గడిపి, ఖలీఫాలాగే నటించి, తెల్లవారేలోపుగా ఇల్లు చేరుకునేవాడు.

ఈవిధంగా ఒక సంవత్సరం గడిచింది.

ఒకరాత్రి ఖలీఫా హారూన్ ఆల్ రషీద్‌కు నిద్ర పట్టలేదు. ఆయన తన వజీరయిన జాఫర్‌ను పిలిచి, "ఈరాత్రి మనం మారు వేషాలతో బగ్దాద్ వీధులవెంట నదిదాకా పోయివద్దాం," అన్నాడు.

త్వరలోనే జాఫర్ ఖలీఫాకూ, తనకూ, మస్రూర్‌కూ వర్తకుల దుస్తులు సమ



కూర్చాడు. వారు వాటిని ధరించి, నిర్మానుష్యమైన వీధులవెంబడి నడుస్తూ నది ఒడ్డుకు వెళ్లారు.

అక్కడ ఒక పడవ ఉండటం చూసి ఖలీఫా, పడవవాడితో, "ఒరే, నీకొక దీనారం ఇస్తాం. మమ్మల్ని కాస్సేపు నది మీద షికారు తిప్పుతావా?" అన్నాడు.

వాడాశ్చర్యపోతూ, "బాబూ, మీరీ నగరంవారు కారా ఏమిటి? ఈవేళప్పుడు ఖలీఫా పడవ వస్తుందని మీ ఎరగరల్లే వుంది," అన్నాడు.

ముగ్గురూ ఒకరి మొహాలొకరు చూసుకున్నారు. పడవవాడు తమతో వచ్చి అబద్ధం

చెబుతున్నాడని వాళ్ళు అనుకుంటున్న సమయంలోనే నది మధ్యగా, దీపాలతో ప్రకాశిస్తూ ఒక పడవ వచ్చింది. "ఖలీఫా పడవ! తప్పుకోండి!" అంటూ బానిసల కేకలు వినపడ్డాయి.

ఆ పడవ దగ్గిరికి వచ్చేసరికి దాని మధ్య గొప్ప దుస్తులు ధరించి ఒక యువకుడూ, వాడి పక్కల జాఫర్, మస్రూర్‌లను పోలిన వ్యక్తులూ ఉండటం కనిపించింది.

ఆ పడవను కొంత దూరం పోనిచ్చి ఖలీఫా, పడవవాడితో, "నీకు పది దీనారా లిస్తాను. మమ్మల్ని నీ పడవలో ఆ పడవ వెనకగా తీసుకుపో." అన్నాడు.

పడవవాడు కొంత అనుమానించి చివరకు ఒప్పుకున్నాడు. పోయి పోయి నకలు ఖలీఫా పడవ ఒక ఉద్యానవనందగ్గిర ఒడ్డు పట్టింది. అసలు ఖలీఫా పడవ దానికి కొంచెందూరంలో ఒడ్డు చేరింది. అందులో నుంచి దిగి ఖలీఫా, అతని అనుచరులూ ఉద్యానవనం వైపు నడవసాగారు.

వారు కొద్దిదూరం వెళ్ళారో లేదో కొందరు బానిసలు చెట్ల చాటునుంచి వచ్చి వారిపైన పడి పట్టుకుని, "ఎవరు మీరు? ఏ దేశంవారు? ఆహ్వానం లేకుండా ఖలీఫా విందు కెలా వచ్చారు?" అని గట్టిగా గదమాయించారు.



"మేము పరదేశులం. ఖలీఫా కరుణిస్తే మేం ఆయన విందులో పాల్గొంటాం. మా కాకలి దహిస్తున్నది," అన్నారు ఖలీఫా, అతని అనుచరులూ.

బానిసలు వారిని తీసుకుపోయి మహమ్మదలీ ఎదట పెట్టారు. మహమ్మదలీ వారు చెప్పినదంతా విని, "మిత్రులారా, ఖలీఫా విందులో అతిథులకు స్థానం వుంది. కూచుని భోజనంచెయ్యండి," అన్నాడు.

లోపల బ్రహ్మాండమైన విందు ఏర్పాట్లు అవీ ఉన్నాయి. ఆ దీపాలూ, వైభవమూ, నౌకర్లూ చూసి ఖలీఫాకే ఆశ్చర్యమయింది. విందు సగంలో ఉండగా ఒక స్త్రీ వచ్చి మనోహరంగా విరహగీతాలు పాడింది.

అవి వింటున్న మహమ్మదలీకి ఉద్రేకం వచ్చేసి, తన ఒంటిమీద వున్న విలువైన దుస్తులను వెంటనే చింపేసుకుని, పిచ్చి ఎత్తినవాడల్లే అయిపోయాడు. అటువంటి వెల గల దుస్తులను నిర్లక్ష్యంగా అతను చింపేస్తున్నందుకే ఆశ్చర్యపడుతున్న ఖలీఫాకు, మహమ్మదలీ శరీరంమీది వాతలు చూసేసరికి మరింత ఆశ్చర్యమయింది. ఆయన తన అనుచరుల చెవిలో, "ఈ వాతలు ఖలీఫా ఒంటిమీద ఖైదీల కుండే చిహ్నాలుండటం చిత్రంకాదా?" అన్నాడు.



తన అతిథుల రహస్య సంభాషణ కనిపెట్టి మహమ్మదలీ, "మిత్రులారా, అతిథులు ఏకాంత సంభాషణ చేయటం మర్యాద కాదు. మీ కేమైనా అనుమానాలుంటే నన్నడగండి," అన్నాడు.

"మరేంలేదు. ఖలీఫాగారి శరీరంమీది మచ్చలు చూస్తే వారికేదో భయంకరమైన అనుభవం సంప్రాప్తమైనట్టు మాకు తోచింది. ఆ అనుభవం యెటువంటిదో తెలుసుకోవాలని మాకు అభిలాషగా వున్న మాట నిజమే," అన్నారు అతిథులు.

మహమ్మదలీ దీనంగా నవ్వి, "మీరు పరదేశులు కనక మీకు నా అనుభవం చెప్పే

స్తాను. సావధానంగా వినండి," అంటూ తన విచిత్ర కథను వారికి చెప్పేశాడు.

అంతా విని ఖలీఫా, "అల్లా మహిమ!" అంటూ లేచి తన అనుచరులతోకూడా నకలుఖలీఫాదగ్గిర సెలవు పుచ్చుకుని తన భవనం చేరుకున్నాడు.

మహమ్మదలీ కథ విన్నతరవాత, అతనికి కలిగిన అన్యాయానికి కొంత బాధ్యత తమదేనని ఖలీఫాకూ, జాఫర్‌కూ తోచింది. ఎందుకంటే ఖలీఫా భార్యకూ, జాఫర్ చెల్లెలికీ మధ్య ఉండే పగే మహమ్మదలీ కష్టాలన్నిటికీ కారణమయింది.

మర్నాడుదయం ఖలీఫా కొలువు తీరి, మహమ్మదలీని పిలిపించాడు.

"ఏమోయ్, నిన్న రాత్రి నువు విదేశీ వర్తకులతో చెప్పిన నీ కథ ఇప్పుడు మళ్ళీ చెప్పు." అన్నాడు ఖలీఫా.

మహమ్మదలీ ఖలీఫా అభయం పొంది, తన కథ యావత్తూ వెల్లడించాడు.

"ఇంత చేసిన నీ భార్యను నువు తిరిగి స్వీకరించగలవా?" అని అడిగాడు ఖలీఫా.

"ఏలినవారి చేతిమీదుగా ఏమిచ్చినా స్వీకరిస్తాను," అన్నాడు మహమ్మదలీ.

"వజీర్, మీ చెల్లెల్ని పిలిపించు," అన్నాడు జాఫర్‌తో ఖలీఫా.

ఆమె రాగానే ఆయన, "ఈ మనిషి నెరుగుదువా?" అని అడిగాడు.

"పరపురుషుణ్ణి ఎరిగే అవకాశం నాకెలా ఉంటుంది!" అన్నదామె.

"ఇతని పేరు మహమ్మదలీ. అయినదేదో అయింది. నేను నిన్నితనికి భార్యగా ఇవ్వ నిశ్చయించాను," అన్నాడు ఖలీఫా.

"మహాప్రసాదం," అన్నదామె.

ఖలీఫా అప్పుడే కాజీని పిలిపించి, అందరి సమక్షానా వారిద్దరికీ మళ్ళీ యథోక్తంగా వివాహం జరిపించాడు. మహమ్మదలీ ఆనాటినుంచి ఖలీఫా అంతరంగికుల్లో ఒకడుగా ఉండిపోయాడు.



# గోడమీది బొమ్మ - 1 (అట్టచివరి బొమ్మ)

చీనాదేశంలోని ఒకానొక పర్వత ప్రాంతంలో పూర్వం, చ్వాంగ్ అనే రైతు యువకుడు ఉండేవాడు. చ్వాంగు కష్టజీవి. రాత్రింబగళ్ళు పాటుపడి ఎంతో సంపాదించేవాడు.

ఎంత సంపాదిస్తే నేం? వాని ఆదాయమంతా రాజుగారి పన్నులు కట్టడానికే చాలకపోయె! అటువంటి సందర్భంలో, చ్వాంగు ఏనాటికి ధనం కూడబెట్టగలడు? ఎప్పుడు పెళ్ళాడటం, ఎప్పుడు సుఖపడటం? పాపం, చ్వాంగ్ స్థితికి తోడివాళ్ళంతా—

ధనకనకాలతొ మూల్గుతుండె మన రాజుగారి కోట,
కానికట్టైనా కానరాదు మన పేద చ్వాంగు చేత:
మున్నూటరువది పత్నులతో బల్ వినోదమందును రాజు,
ఎన్నటికే నొక ఇంటివాడయిన కాగలడా మన చ్వాంగు?

అని సానుభూతితో పాడేవాళ్లు. ఇలా వుండగా—ఒకనాడొక చిత్రకళా నిపుణుడు చ్వాంగ్ ఇంటివైపు రావడం తటస్థించింది. ఈ చిత్రకారుడు అసామాన్యుడు. ఇతడు వేసే బొమ్మలు జీవకళతో ఉట్టిపడటమే కాదు, అవి అపూర్వమైన మహిమగల్గివుంటాయి.

ఈ చిత్రకారుడు, తోడూనీడా లేని చ్వాంగునుగురించి ఈవరకే విన్నాడు. ఇప్పుడు వాని ఇల్లు చూడగానే అతడికి చ్వాంగు చరిత్ర జ్ఞాపకానికి వచ్చింది. జాలివేసింది. ఐతే, అందరిలాగా చిత్రకారుడు జాలిచెంది ఊరుకోలేదు. మనిషి ఎత్తున ఒక అపురూప సుందరిని చ్వాంగుకు చిత్రించి ఇచ్చి, మరీ వెళ్ళాడు.

ఇంటికి శోభకూర్చే సుందరి బొమ్మను ఎంతో అప్యాయంగా చ్వాంగ్ తన యింట్లో గోడకు అలంకరించుకున్నాడు. అస్తమానం ఆ చిత్రంకేసి ఆశ్చర్యంగా చూస్తూ తన్మయత పొందసాగాడు. కాని, అలా కూర్చుంటే పొట్ట గడపటమెలా? అందుచేత, మళ్ళీ మామూలుగా పొలానికి వెళ్ళాలనుకున్నాడు.

ఐతే—ఇంటో గోడపైన సుందరి బొమ్మను వేలాడకట్టినప్పటినుంచీ, చ్వాంగుకు కొత్త వికాసం కలిగి కొత్తఊహలు కల్గజొచ్చినై. మరునాడు పొలానికి బయల్దేరేముందు ఒక్కసారి గోడపైనున్న సుందరివైపు చూసి, పెద్దగా నిట్టూర్చి, 'ఇటువంటి సుందరి ఒకతె నా యింటోవుండి, నాకు వంటచేసిపెడితే ఎంత బావుండును!!...' అనుకున్నాడు.

# గడుసరి భార్య

అన్నవరం గ్రామములో
ఉన్నాడొక రైతు,
తెలివితేట లొకించుకయు
కలుగని ఒక బైతు!

అతని పేరు వెంకటయ్యా,
అతివ పేరు గౌరిదేవి,
అతడెంతటి అమాయకుడొ
ఆమె అంత గడుసరి!

అతనికి కాకర కాయలు
అతి ప్రియము; అందుచేత






తన పొలమున పాదు వేసి
తానె పెంచి పెద్దచేసె.

మూడే కాకర కాయలు
ముచ్చటగా కాసినవి—
ఒకనా డవి కోసివైచి
ఉవిద కిచ్చి వండుమనెను!

అని, అమాయకుడు, పాపము
తన పొలమున కేగినాడు,
కాకర కాయలను వండ
గా సాగెను గౌరిదేవి.

నేతియందు వేపునపుడు
ఆ తస్వికి నోరూరెను!





రచన: వజ్రపాణి

ఒకే కాయ ఉన్నదేమి ?
అకటా !'' అన, ఆమె చెప్పె :

"రుచి చూడగ నొకటి తింటి,
ప్రచుర ధర్మ సమ్మతముగ
రెంటియందు నొకటి తింటి,
తంటా యేమున్నదిందు ?"

"ఎట్లు తింటివే ?" అని చీ
వాట్లు పెట్టె నామెభర్త ;
"ఇటు "లని, మిగిలిన కాయను
'గుటుకు 'న దిగమ్రింగె భార్య !

ఉప్పు, కారముల జూడగ
నొక్క కాయ మ్రింగివైచె !

వేళ మించిపోవుచుండె,
వెంకటయ్య రాడాయెను !
ఆకలితో గౌరిదేవి
అన్నము వడ్డించుకొనెను !

"అర్థాంగికి సగమువంతు
ఆర్యసమ్మతమే కదా !"
అని, మిగిలిన రెండు కాయ
ల నింకొకటి తినివైచెను !

వేళమిగిలి వచ్చినట్టి
వెంకటయ్య, "విస్తిలో







# గ్రహాలు: శుక్రుడు

సూర్యుడికి దగ్గిరగా ఉండే గ్రహాలలో బుధుడి తరవాతది శుక్రుడు. ఇది సూర్యుడికి 6,72,45,000 మైళ్ళ దూరాన ఉన్నది. శుక్రుడు భూమికంటె కొద్దిగా చిన్న గ్రహం. భూమి అడ్డుకొలత 7,918 మైళ్ళు, అయితే శుక్రుడిది 7,826 మైళ్ళు. శుక్ర గ్రహం మన భూమికి 2 కోట్ల 37 లక్షల మైళ్ళ దూరంలోకి వస్తూ, 16 కోట్ల 22 లక్షల మైళ్ళ దూరానికి పోతూవుంటుంది.

భూమికి గల ఆకర్షణశక్తితో పోలిస్తే శుక్రుడి ఆకర్షణశక్తి నూటికి 14 పాళ్ళు తక్కువ.

భూమికన్న సూర్యుడికి దగ్గిరగా ఉండటంచేత శుక్రుడిమీద పడే సూర్యకాంతీ, వేడీ కూడా భూమిమీద పడేదానికి రెట్టింపువాకా వుంటుంది.

రోజుకు 18 లక్షల 73 వేల మైళ్ళ వేగాన నడుస్తూ, శుక్ర గ్రహం 224 రోజుల 16 గంటల 48 నిమిషాల కాలంలో ఒకసారి సూర్యుణ్ణి చుట్టివస్తుంది.

సూర్యుడికి చాలాదగ్గిరగా ఉన్న గ్రహం కావటంచేత భూమిమీదినుంచి చూసే మనకు సూర్యుడికి దగ్గిరలోనే కనిపిస్తుంది ఒకప్పుడిది సూర్యుడికి వెనకగా అస్తమిస్తుంది, మరొకప్పుడు సూర్యుడికి ముందుగా ఉదయిస్తుంది సూర్యుడికి ముందుగా ఉదయించేటప్పుడు దీనిని మనం వేగుజుక్క అంటాం. ఇది ఆకాశంలో కనిపించిన కొద్దిసేపు దీని కాంతి మిగిలిన నక్షత్రాలన్నిటి కాంతిని మించి ఉంటుంది.

భూమి ఇరవైనాలుగు గంటల కొకపర్యాయం తన చుట్టూ తాను తిరుగుతుంది. అది మనకు ఒక రోజు. శుక్ర గ్రహం ఎంతకాలాని కొకసారి తన చుట్టూ తాను తిరుగేదీ తెలియదు. అదికూడా బుధుడిలాగే సంవత్సరాని కొకసారి తనచుట్టూ తాను తిరుగుతుందనీ, ఎప్పుడూ ఒక ముఖమే సూర్యుడికేసి ఉంటుందనీ కొందరు నమ్ముతున్నారు.

మనం శుక్రుడికేసి టెలస్కోపులోనుంచి చూసినట్టయితే కనిపించినంత మేర మంచులాగా తెల్లగా ప్రకాశిస్తూ ఉంటుంది. ఈ తెల్లని గ్రహంమీదా మరింత తెల్లని, కాంతివంతమైన చుక్కలు కనిపిస్తాయి. వీటినిబట్టి శుక్రుడి పై భాగం ఎట్లా ఉండేదీ సరిగా అర్థంకాదు. ఇది భూమిని పోలినదేగనక దీనిమీద కొండలూ, లోయలూ, మైదానాలూ ఉండవచ్చు.

## ఫోటోవ్యాఖ్యల పోటీ :: బహుమానం రు. 10 లు

1955 సెప్టెంబర్ సంచికలో ప్రకటింపబడే ఫోటోలకు నమూనాలు





★ పై ఫోటోలకు సరిఐన వ్యాఖ్యలు ఒక్క మాటలోగానీ, చిన్న వాక్యంలోగానీ కావాలి. రెండు వ్యాఖ్యలకూ సంబంధం వుండాలి.

★ జులై 10-వ తేదీలోగా వ్యాఖ్యలు మాకు చేరాలి. తరువాత చేరే వ్యాఖ్యలు ఎంత మాత్రమూ పరిశీలింపబడవు.

★ మాకు చేరిన వ్యాఖ్యలలో అత్యుత్తమంగా వున్న సెట్టుకు (రెండు వ్యాఖ్యలకు కలిపి) రు. 10/-లు బహుమానం.

★ వ్యాఖ్యలు రెండూ పోస్టుకార్డుపైన వ్రాసి, ఈ అడ్రసుకు పంపాలి:—చందమామ ఫోటో వ్యాఖ్యల పోటీ, మద్రాసు-26.

---

## జూలై నెల పోటీ ఫలితాలు

మొదటి ఫోటో : గూటిలో వయారం | రెండవ ఫోటో : తోటలో మయూరం

పంపినవారు : నూతక్కి మోహనరావు,

మారుతీనగరు, విజయవాడ - 2.

బహుమతిమొత్తం రు. 10/- ఈ నెలాఖరులోగా పంపబడుతుంది



# వార్తలు-విశేషాలు

ఆంధ్ర బాలబాలికల ప్రథమ చిత్రకళా ప్రదర్శనం కాకినాడలో అగస్టు 27, 28, 29 తేదీలలో జరుగుతుంది. 18 సంవత్సరాల లోపు వయసుగల బాలబాలికల కళాదృష్టిని ప్రోత్సాహించటానికి ఈ ప్రదర్శనం ఏర్పాటుచేయబడింది.

*　　　*　　　*　　　*

ఆంధ్రరాష్ట్రంలోని యెర్రగొంట్ల, పాణ్యం, మాచర్ల అనే మూడు ప్రదేశాలలో సిమెంటు ఫ్యాక్టరీల స్థాపనకు లైసెన్సులు మంజూరుచేయబడినై. ఇదీగాక, కర్నూలులో కొత్తగా ఒక పేపరుమిల్లు పెట్టటానికికూడ ఆలోచనలు జరుగుతున్నవి.

*　　　*　　　*　　　*

ద్వితీయ పంచవర్ష ప్రణాళికలో ఆరోగ్యపథకాల నిమిత్తం 208 కోట్ల రూపాయలవరకు కేటాయింపబడవచ్చునని తెలుస్తున్నది.

*　　　*　　　*　　　*

సామర్లకోటలో కోళ్ళపరిశ్రమ కేంద్రం స్థాపించటానికని రాష్ట్రప్రభుత్వంవారు రు. 50,000 మంజూరు చేశారు.

*　　　*　　　*　　　*

భారత ప్రధాని పండిట్ నెహ్రూ వ్రాసిన 'డిస్కవరీ ఆఫ్ ఇండియా' అనే గ్రంథాన్ని సోవియెట్ సారస్వత ప్రచురణ సంస్థవారు రష్యన్ భాషలోకి అనువదించి ప్రకటించారు. పండిట్ నెహ్రూ దీనికి పీఠికవ్రాస్తూ, ప్రచురణ సంస్థవారి ప్రయత్నాన్ని అభినందించారు.



అండమాను దీవులలో పరిశోధనలు జరుపుతున్న భారత వైజ్ఞానికులు ఒకానొక ఆదిమ జాతివారితో తొలిసారిగా మైత్రిచేశారు. ఆ జాతిపేరు 'ఓంజే' జాతి. వీరి సంఖ్య 200. వీరికి నిప్పు అంటే ఏమిటో తెలియదు.

*　　　　*　　　　*　　　　*

మహారాష్ట్ర సామ్రాజ్య నిర్మాత ఛత్రపతి శివాజీకి, ప్రతాపగడ్ కోటలో వచ్చే ఏప్రిలులోగా లక్ష రూపాయల వ్యయంతో ఒక స్మారకచిహ్నం నిర్మింపబడుతుంది.

*　　　　*　　　　*　　　　*

మాస్కోలోని విదేశ సారస్వత సంస్థ తాలూకు 'ఆల్ యూనియన్ లైబ్రరీ'లో జూన్ 7-వ తేదీన భారతదేశానికి సంబంధించిన ప్రదర్శనం ఏర్పాటుచేయబడింది. భారత ప్రజాజీవితం, వారి సంస్కృతుల వికాసంగురించి వివరించే గ్రంథాలు, పత్రికలు, అక్కడ ప్రదర్శించబడినై.

*　　　　*　　　　*　　　　*

మన ప్రధాని పండిట్ నెహ్రూ, సోవియెట్ ప్రభుత్వ ఆహ్వానంపై జూన్ 4-వ తేదీనుంచి జూన్ 22-వ తేదీవరకూ రష్యాలో పర్యటించారు. ప్రధానికి సోవియెట్ ప్రభుత్వం, ప్రజలు ఘనమైన స్వాగతం యిచ్చారు. ఆయన రష్యాలో దాదాపు 10 వేల మైళ్లు పర్యటించి ముఖ్యమైన కర్మాగారాలూ, ఆనకట్టలూ, పట్టణాలూ సందర్శించారు.

*　　　　*　　　　*　　　　*

తిరువాన్కూరు-కొచిన్ కాలేజి విద్యార్థులు స్వయంగా తీసిన 'పత్రికల కుర్రవాడు' అనే మలయాళచిత్రం బొంబాయిలో జూన్ 8-న ప్రివ్యూ ఇవ్వబడింది. కెమేరామన్, సౌండ్ ఇంజనీరు తప్ప తక్కినవారందరూ విద్యార్థులే.

*　　　　*　　　　*　　　　*

**1250** సంవత్సరాల తర్వాత ఈ జూన్ 20-న సంపూర్ణ సూర్యగ్రహణం పట్టింది. దేశదేశాల వైజ్ఞానికులు దీనిని పరిశోధించడానికని సిలోనులో వేచివున్నారు. కాని, పూర్తి గ్రహణానికి ఇక ఒక నిమిషం ఉందనగా కారుమబ్బులు సూర్యబింబాన్ని కప్పివేయడంతో వారి ప్రయత్నాలు నిష్ఫలమైనాయి. ఇటువంటి గ్రహణం మళ్ళీ 2168 సంవత్సరంవరకూ రాదట.



# చిత్రకథ



దాసూ, వాసూలు ఒక రోజున 'టైగర్'ని వెంటపెట్టుకుని షికారు బయలు దేరారు. "'టైగర్' అంటే పులిగదా? ఆ ఇంటిమీద కనబడే పిల్లిని మన టైగర్‌చేత తరిమిద్దాం!" అన్నాడు దాసు. అందుకు వాసు సరేనన్నాడు. తీరా ఇంటిని సమీపించేసరికి, ఇంటిమీద కూర్చున్న పెద్ద జంగుపిల్లి కాస్తా కిందికి దిగివచ్చి, అక్కడవున్న పీపామీద నిలబడింది. దాసూ, వాసూలు ఉసి కొలిపేసరికి 'టైగర్' దానిమీదికి దూకింది, కాని జంగుపిల్లి బిగ్గరగా అరుస్తూ పీపాలోంచి బయటికి వచ్చేటంతలో టైగర్ ఉడాయించింది. పేరు టైగర్ అయితే మాత్రం, కుక్క, పులి ఎలా అవుతుంది అనుకున్నారు దాసూ, వాసూలు.



Printed by B. NAGI REDDI at the B. N. K. Press Ltd., Madras 26, and Published by him for Chandamama Publications, Madras 26. Controlling Editor: SRI 'CHAKRAPANI'

Photo by A. L. Syed



బహుమతి
పొందిన వ్యాఖ్య

తోటలో మయూరం

పంపినవారు :
ఎస్. మోహనరావు - బెజవాడ

